# ★ ఆగ్నేయాసియాలో నెహ్రూ పర్యటన ★



జూన్ 12 వ తేదీన గాడ్జమాడా విశ్వవిద్యాలయవిద్యార్థుల సమావేశంలో
ప్రధాని నెహ్రూ ప్రసంగం.



ప్రధాని నెహ్రూకు ఇండొనేషియా రక్షణశాఖల సైనికవందనం. —జకార్తా—జూన్ 7.

# ఆంధ్రపత్రిక

| | | |
|---|---|---|
| సంవత్సరచందా<br>రు. 12-0-0<br>విడిప్రతిక<br>4 అణాలు | ప్రతిబుధవారము ప్రకటింపబడును.<br>ఒరులేయవియొనరించిన నరవర, యప్రియము తనమనంబున కగు దా<br>నొరులకు నవి సేయకునికి పరాయణము పరమధర్మపథముల కెల్లన్<br>(మహాభారతము)<br>**Founder : K. NAGESWARA RAO** | సంపుటము **42**<br>సంచిక **43** |

వికృతి సంవత్సర అధికాషాఢ శుద్ధ చతుర్దశి బుధవారము




జూన్ 11-వ తేదీన భారతప్రభుత్వాధ్యక్షులు డాక్టర్ రాజేంద్రప్రసాద్ ఢిల్లీలోని ఎర్రకోటకు వచ్చి దానిలో వున్న సుందరమైన కట్టడాలనన్నిటినీ చూచారు. దర్బారులో మొగలు చక్రవర్తులు దర్బారుతీర్చే దివానీమీద నిల్చునివున్నారు.



ఆంధ్రపత్రిక

1950-వ సం॥ జూన్ నెల 28-వ తేది బుధవారము

# సమితిఅధ్యక్షుని హెచ్చరిక

రాజ్యాంగతంత్రజ్ఞులు యుద్ధము అనివార్యము గాదు అని చెప్పినట్లే, ప్రపంచసంగ్రామము తప్పనిసరియను భావము ప్రజలలో ప్రబలమగుచున్నది. ప్రపంచరాజకీయవేత్తలు యుద్ధము అనివార్యము గాదని చెప్పుటకు బదులు, యుద్ధము నివార్యమని చెప్పగలిగిన ప్రజలలో ఇట్టిభావములు ఏర్పడవు. యుద్ధము నివార్యమా? అనివార్యమా? యనువిషయమై తర్జన, భర్జనలు జరుపుటకు బదులు శాంతిస్థాపన సాధ్యమా? అసాధ్యమా? శాంతి స్థాపనకు అనుసరింపదగిన మార్గములెవ్వి? అసాధ్యము గాకుండ చేయుటకు తీసుకొనవలసిన చర్యలేమి? యను విషయములపై దృష్టిని కేంద్రీకరించి యుద్ధ ప్రసక్తికి స్వస్తిచెప్పిన యుద్ధము నివార్యమగుటెగాక, శాంతిస్థాపన సులభము కాగలదు.

ప్రపంచరాజ్యాంగవేత్తలు ఈ విధానమును అనుసరించుటకు వారి ప్రస్తుతదృక్పథము, దృష్టి కూడ మారినగాని సాధ్యముగాదు. ఫిలిప్పీన్సు విదేశాంగమంత్రి, ఐక్యరాజ్యసమితిసర్వసభ్యసమావేశము అధ్యక్షుడు జనరల్ కార్లోస్‌రోమ్యులో హార్వర్డు విశ్వవిద్యాలయపూర్వవిద్యార్థుల సమావేశములో ప్రసంగించుచు ప్రాక్-పశ్చిమ దేశములమధ్య నానాటికి అధికమగుచున్న, తీవ్రమగుచున్న విభేదముల తొలగించుటకు, అందుకు కారణమైన సమస్యల పరిష్కారమునకు పశ్చిమరాజ్యములవారు అనుసరింపతగ్గ విధానమును చక్కగ, విస్పష్టముగ వివరించిరి. రష్యా-అమెరికాలకు నేడు జరుగుచున్న ప్రచ్ఛన్నయుద్ధములో ఆసియారాజ్యములు తటస్థవైఖరిని అవలంబించుటకు గల కారణములను కూడ వారు ఎవరికి ఎట్టి అనుమానములు ఏర్పడుటకు వీలులేనివిధముగ వివరించిరి.

అదే విశ్వవిద్యాలయస్నాతకోత్సవసభయందు అదేరోజున అమెరికాప్రభుత్వవిదేశాంగశాఖా కార్యదర్శి డీన్ అఛిసన్ యుద్ధము అనివార్యము గాదనుచు, ప్రాక్, పశ్చిమవిభేదముల తొలగింపవచ్చునని ప్రకటించిరి. కాని ఆ విభేదములను తొలగించుటకు అమెరికా ఎట్టివిధానమును అనుసరింపనున్నదో వారు తెలిపియుండలేదు. రష్యా తన ప్రస్తుత విధానమును మార్చుకొనినగాని యుద్ధము అనివార్యము గాదని మామూలుధోరణిలోనే ప్రకటించిరి. ఇటీవల అమెరికాఅధ్యక్షుడు అఛిసన్‌విధానమును సమర్థించుచు చేసిన ప్రసంగములందుకూడ ప్రస్తుతప్రతిష్టంభనాపరిష్కారమునకు తాము నిర్మాణాత్మకమైన కార్యక్రమమును అనుసరింపనున్న ట్లేమియు తెలుపక, క్రెమ్లిన్ నాయకులె తమ విధానమును మార్చుకొనవలసియున్నదని హెచ్చరించిరి. అమెరికా అధ్యక్షునకు విదేశాంగవ్యవహారములలో రిపబ్లికన్ పక్షమునకు సలహాదారుగ నుండుచున్న జాన్‌ఫాస్టర్ డల్లెస్ మొన్న టోకియోలో ప్రసంగించుచు ప్రజాస్వామిక దేశముల సైనికబలము, ఆయుధసంపత్తే రష్యాను యుద్ధచర్యలనుండి మరల్చగలదని చెప్పిరి.

జనరల్ కార్లోస్ రోమ్యులో ఈ విధానమే, ఈ వైఖరే మార్పు చెందవలసియున్నదని చెప్పిరి. ఆసియాయందు ఉద్భవించిన జాతీయోద్యమములన్నియు కమ్యూనిజముఅవతారములని అపోహపడి, ఆ ఉద్యమముల నణచివేయుటకు పాశ్చాత్యరాజ్యములు సామ్రాజ్యదేశములకు తోడ్పడుటవలన కమ్యూనిజం ప్రాచ్యదేశములందు బలపడుచున్నదని హెచ్చరించిరి. మలయా, ఇండోచైనాలందు బ్రిటన్, ఫ్రాన్సులు అనుసరించుచున్న విధానములు, ఆ దేశములకు అమెరికా చేయుచున్న సహాయమును

చూచియే ఫిలిప్పీన్సువిదేశాంగమంత్రి ఇట్లు ప్రకటించుట, పాశ్చాత్య దేశముల విధానములను విమర్శించుట జరిగెను. పాశ్చాత్యదేశములు ఆసియాసమస్యలను ఆసియాప్రజల దృష్ట్యా పరిశీలింపవలసి యుండునని హెచ్చరించిరి.

ఆసియాలో కమ్యూనిష్టు ఉద్యమములు బలపడుటకు అచటి ప్రజాస్వామికవాదులకు పాశ్చాత్య దేశములు సకాలములో తగినంత సహాయము చేయక పోవుటేనని ఫిలిప్పీన్సు విదేశాంగమంత్రి చేసిన హెచ్చరికను అమెరికా అధ్యక్షుడు, విదేశాంగమంత్రి ముఖ్యముగ గమనింపవలసి యున్నది. అమెరికా, రష్యాలు ఒకరి తప్పులను మరొకరు ఎన్నుటతో, ఒకరిపై మరొకరు నిందారోపణలు చేయుటతో కాలహరణము చేయుటకు బదులు కార్లోస్ రోమ్యులోఉద్బోధను గ్రహించి నవఆసియాలో క్రమక్రమము అభివృద్ధి చెందుచున్న నవ్యతత్వమును గుర్తించిన నేటి ప్రచ్ఛన్నయుద్ధమును తక్షణము అంతమొందించుటకేగాక, ప్రపంచసంగ్రామమును నివారింపను వీలగును. భారతప్రధానమంత్రి గతరెండు సంవత్సరములుగ అనుసరించుచున్న తటస్థవిధానము ప్రాధాన్యమును సమితిఅధ్యక్షుడు అమెరికనులకు అవగాహన కాగలవిధమున వివరించిరి. అమెరికా, రష్యాకూటములలో ఎందు చేరవలెనను విషయమున ఒక నిశ్చితాభిప్రాయమునకు రాజాలక ఆసియా రాజ్యములు తటస్థవిధానమును అనుసరించుట లేదు. ఇప్పటికే విషమించియున్న పరిస్థితుల నింకను విషమంచేయుట ఆసియారాజ్యముల ఉద్దేశ్యముకాదు గనుకనే ఎటు చేరక తటస్థముగ నుండుట సంభవించుచున్నది. అమెరికా, రష్యాలు ఈ యథార్థమును గ్రహించి ఆసియా దేశముల ఆంతరంగిక వ్యవహారములందు జోక్యముకల్గించుకొనకుండిన ప్రచ్ఛన్నయుద్ధము అతిశీఘ్రముగ అంతము కాగలదు. అందుకు సెప్టెంబరులో జరుగనున్న సమితివార్షికసమావేశము ఆసియాలో జరిగిన కొంతవరకు ఉపయోగపడగలదు.

---

# రష్యా - భారతదేశసంబంధములు

భారతదేశము సర్వాధికారసమన్వితప్రజారాజ్యమైనప్పటి నుండియు, సోవియట్ రష్యా భారత ప్రభుత్వముయెడల, భారత ప్రజానాయకులయెడ అంతవరకు ప్రదర్శించుచు వచ్చిన మైత్రీభావమును విసర్జించి ఒకవిధమైన ప్రతికూలవిధానమును అనుసరించుచుండెను. పండిట్ నెహ్రూప్రభృతులను సామ్రాజ్యవాదుల 'ఏజెంట్లు' అని విమర్శించెను, భారతీయు లింకను సంపూర్ణస్వాతంత్ర్యమును పొందవలసియున్నదని హెచ్చరించుచుండెను. భారత ప్రజానీకమునకు సంపూర్ణ, ఆర్థిక, రాజకీయ, సాంఘిక స్వాతంత్ర్యమును ప్రసాదించు బాధ్యత తమపై గలదని అందుకు భారతదేశకమ్యూనిష్టుపక్షమె ఫలముల నొసగగల సాధనమని క్రెమ్లిన్ నాయకులు భావించుచుండిరి. అమెరికా, బ్రిటన్ ధనికవర్గములు అణచి వేయుచున్న ప్రపంచప్రజానీకమును ఉద్ధరించుటకే సోవియట్ రష్యా అవతరించినదని విశ్వసించుచున్న స్టాలిన్ ప్రభృతులు ఇట్లు భావించుటయందు ఆశ్చర్య పడవలసినది ఏమియు లేదు.

అయాచితముగ పరాధీనప్రపంచప్రజల నాయకత్వము తమకు సంక్రమించినదని మాలటావ్ ప్రభృతులు అనేకపర్యాయములు ప్రకటించిరి. ప్రజాస్వామికరాజ్యములందలి కమ్యూనిష్టు పక్షములు ఈ నాయకత్వమును అంగీకరించి తమ దేశములందలి రాజ్యాధికారమును కైవశము చేసుకొనుటకు క్రెమ్లిన్ ఆదేశముల ప్రకారము అరాచకచర్యలను ప్రోత్సహించుచుండిరి. అట్టి అరాచకచర్యలను అణచి వేయుటకు ఏ ప్రభుత్వమైనను కఠినచర్యలు తీసుకొనిన అట్టి ప్రభుత్వము తమ శత్రువర్గములో చేరినదని యెంచి, ఆ ప్రభుత్వముపై అసభ్యప్రచారమును సాగించుటె మాస్కోవిధానము.

భారత ప్రభుత్వము కమ్యూనిష్టుపక్షముపై దేశవ్యాప్తచర్యలను ఇంతవరకు తీసుకొనియుండ లేదు. సమ్మెల ప్రోత్సహించి వస్తూత్పత్తిని అధికము చేయుటకు జరుగుచున్న ప్రయత్నములను ప్రతిఘటించుచున్న కమ్యూనిష్టులపైమాత్రము ఆయా రాష్ట్ర ప్రభుత్వములు చర్యలు తీసుకొనుచున్నవి.

ఈ చర్యలను, సోవియట్ రష్యా తనపై తీసుకొనబడుచున్న చర్యలుగ భావించి భారతీయనాయకులపై సమయాసమయములనుగాని ఉచితానుచితములనుగాని పాటింపక తీవ్రవిమర్శలు చేయుచుండెను.

భారతప్రజలకును, నాయకులకును క్రెమ్లిన్ అనుసరించుచున్న ఈ విధానము ప్రారంభములో కొంత విస్మయకారకమైనను, క్రమముగ రష్యాఅంతరంగికఉద్దేశ్యములు వెల్లడియైన తరువాత ఏమాత్రము బాధాకరముగ నుండుటలేదు. ఈ నాటికిని రష్యా పాలకులయెడ గాని, కమ్యూనిస్టు వ్యవస్థయెడలగాని ఎట్టి ప్రతికూలభావము భారతప్రభుత్వమునకు లేదు. ప్రధానమంత్రి పండిట్ జవహర్లాల్ నెహ్రూ కమ్యూనిజంపై తనకెట్టి ద్వేషభావమును లేదని, కమ్యూనిస్టు వ్యవస్థయెడ తమకు అభిమానము గలదని పలుమార్లు ప్రకటించియుండిరి. అల్లె కమ్యూనిస్టుపక్షముల విధానమును, సోవియట్ రష్యాయందు వ్యక్తిస్వాతంత్ర్య నిర్మూలనమును వారు తీవ్రముగ విమర్శించుచుండిరి. మాస్కోపాలకులకు ఇవె సరిపడని విషయములు. భారతదేశము బ్రిటన్, అమెరికాలతోగల ఆర్థిక, రాజకీయవాణిజ్యసంబంధములను తెగతెంపులు చేసుకొని రష్యాను ఆశ్రయింపవలెనని క్రెమ్లిన్ భావము. భారతదేశమును బెదరింపవలెననియె ప్రధానమంత్రి పండిట్ నెహ్రూ అమెరికాఅధ్యక్షుని ఆహ్వానమును అంగీకరించి ఆ దేశపర్యటనకు వెళ్ళగ, రష్యా పాకిస్తాన్ప్రధానమంత్రిని మాస్కో ఆహ్వానించెను. కాని కమ్యూనిస్టువిధానమునకు అత్యంత సన్నిహితమైన ఆర్థిక, సాంఘికవ్యవస్థస్థాపనకు భారతప్రభుత్వము అనుకూలముగ నున్నంతగ పాకిస్తాన్ లేదని, ప్రధానమంత్రి లియాఖత్ ఆలీఖాన్ అమెరికాపర్యటనలో చేసిన ప్రసంగములవలన మాస్కోఅధికారులు గ్రహించియుందురు. అయినను భారతదేశమునకు ప్రతిగ పాకిస్తాన్ను చేరదీయవలెనని అటు పాశ్చాత్యప్రజాస్వామికములు ప్రయత్నించుచున్నవి. గనుక పాకిస్తాన్ను తమ కూటమిలో చేర్చుకొనుటకు రష్యాపాలకులు ప్రయత్నించుచుండిరి. అందుకు భారతదేశమును, భారతీయనాయకులను తీవ్రముగ విమర్శించుచుండిరి.

అందుకుగాకున్న పండిట్ నెహ్రూ ఆగ్నేయాసియాపర్యటనసందర్భమున కమ్యూనిస్టుల విధానమును విమర్శించుచు చేసిన ప్రసంగములపై "న్యూటైమ్స్" పత్రిక తీవ్రవిమర్శ చేయుటకుగాని, ఆ విమర్శను మాస్కో రేడియో ప్రసారముచేయుటకు గాని అవకాశము లేదు. దౌర్జన్యచర్యలవలన ఎట్టి ప్రయోజనము లేదని, కమ్యూనిస్టులు అట్టి విధ్వంసక చర్యలనుండి విరమింపవలెననిమాత్రమె పండిట్ నెహ్రూ సింగపూర్ సభయందు ఉద్బోధించెను. భారతదేశమునందలి కమ్యూనిస్టులకును పండిట్ నెహ్రూ అట్టిసలహానె ఇచ్చియుండెను. పండిట్ నెహ్రూ ప్రసంగములను సవ్యముగ అవగాహనచేసుకొనుటకు ప్రయత్నింపకపోవుటవలననె రష్యన్ పత్రికలు ఇట్టి విమర్శలు చేయుట జరుగుచున్నది. చైనాకమ్యూనిస్టులును ఇదే విధానమును అవలంబించిరి. భారతదేశము ఎంత సానుభూతితో ప్రవర్తించినను, ఎంత తటస్థముగ నున్నను రష్యావిధానము మార్పుచెందదని భారతప్రభుత్వము గ్రహింపవలసియున్నది.

## విషయానుక్రమణిక

## 28 జూన్ 1950

# మనదేశం

## రేషన్లు

ఇక నించి దేశంలో మోటార్ల జోరు హోరూ ఎక్కువే, మళ్లీ యేడు జరగబోయే ఎన్నికల జోరు మరింత ఎక్కువ కావడానికి ప్రభుత్వం అవకాశమిచ్చింది. జూలై 1 నుంచి చెన్నపట్నం, బొంబాయి, కలకత్తా, కొచిన్, ఎర్నాకులం రేవుపట్టణాల్లో పెట్రోల్ రేషన్ రద్దవుతుంది. దేశం అంతటా రేషన్ సగం పెంచబడుతుంది. ఇది సవ్యంగా కొనసాగినట్లయితే ఎన్నికల నాటికి పెట్రోల్ రేషనింగ్ పూర్తిగా రద్దు కావచ్చును. రేషనింగ్ ఉన్నప్పటికీ అందరికీ అంత బాధ కలిగిందని చెప్పలేం. ప్రభుత్వపు మోటార్లకీ, కాంగ్రెస్ నాయకులికీ, శాసనసభ్యులికీ విరివిగా లభ్యమౌతూనే ఉండేది. కల్తీ పెట్రోల్ బ్లాక్ మార్కెటింగ్ కూడా విరివిగానే ఉండేది. స్పెషల్ కూపన్ల వంకతో పదిసార్లు ఉద్యోగులు మంత్రుల చుట్టూ తిరగడానికి అవకాశం ఉంటూ అప్పుడుండేది. ఇప్పుడింకో వంక దొరక్కపోదు.

బియ్యం రేషన్ ప్రమాణం ఎనిమిదౌన్సుల నించి ఏడౌన్సులికి తగ్గించడంతోబాటు కొద్దిగా ధర కూడా పెంచారు. రూపాయికి 12 అణాలిచ్చేబదులు 11½ అణాలే ఇస్తారు. బియ్యంకంటె కొద్దిగా చౌకగా ఉండే గోధుమలను (రూపాయికి 12½ అణాలు) మనిషికి రోజుకి ఒక ఔన్సు అధికంగా ఇస్తారు. దీనివల్ల బియ్యంధర హెచ్చింపులో కొంతకొంత గోధుమధర సర్దవచ్చును. అయితే ఇది బహు తక్కువుంటుంది. ఎనిమిదౌన్సుల బియ్యం రెండౌన్సుల గోధుమలు (మిగతా రెండౌన్సులూ సెమోలినా, మొక్క జొన్న కొనేవారు అగుదు) కొనే బదులు ఇకనించి ఏడౌన్సుల బియ్యం మూడౌన్సుల గోధుమ కొనాలి. అందువల్ల ఏడౌన్సుల బియ్యంధర హెచ్చింపుకి ఒక ఔన్సు గోధుమధర తగ్గింపు ఏ కొద్ది పైసల్లోనో ఉంటే అది పైసల కొట్టివేతల్లో దుకాణదారు గుంజేస్తాడు.

* * *

నిర్బంధంలో ఉంచబడిన డిటెన్యూ తన కేసును కోర్టుకి తీసికెడితే, ఆ కోర్టులో నిర్బంధ హేతువుల్ని తెలియపరచరాదని నిషేధించిన భారతప్రభుత్వ శాసనంలోని 14 వ నిబంధన కొత్తరాజ్యాంగం ప్రకారం అక్రమమైనదని సుప్రీం కోర్టు తీర్పు ఇచ్చినందువల్ల రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ ఆ 14 వ నిబంధనను ఒక ఆర్డినెన్సు ద్వారా రద్దుపరిచారు. సుప్రీం కోర్టులో మలబార్ కమ్యూనిస్టు గోపాలన్ పిటిషన్ విచారణఫలితంగా ప్రభుత్వాధికారాలు, పార్లమెంటు శాసన నిర్ణయాధికారాల పరిమితి, కోర్టుల అధికారపరిమితి, వ్యక్తి స్వాతంత్ర్యనియమాల పరిమితి కొంత స్పష్టపడినాయని చెప్పవచ్చును. సుప్రీం కోర్టు తీర్పు ననుసరించి చాలా కేసుల్లో నిర్బంధ హేతువులు స్పష్టంగా లేనందువల్ల ఆ ఖైదీల్ని విడిచిపెట్టవలసిందిగా హైకోర్టులు తీర్పులిచ్చాయి.



రెండు మైక్రోఫోన్లను రెండుచేతులతో గట్టిగా పట్టుకొని సింగపూర్ బహిరంగసభలో (18వ తేదీ) ఉపన్యసించిన భారతప్రధాని నెహ్రూ.

రాష్ట్రపతి ఆచేత్తోనే అదే ఆర్డినెన్సు ద్వారా నిర్బంధశాసనంకింద జిల్లా మేజస్ట్రేట్లు, అడిషనల్ మేజస్ట్రేట్లు నిర్వహించగల అధికారాలను హైదరాబాద్‌లో అధికారులు కూడా నిర్వహించవచ్చునని ఆజ్ఞ ఇచ్చారు.

## కమ్యూనిస్టు పార్టీ *

కమ్యూనిస్టుపార్టీ నాయకత్వంలోనూ, కార్యక్రమంలోనూ మార్పులొస్తాయనే వార్తలు ఈమధ్య విరివిగా వస్తున్నాయి. పార్టీనుంచి తొలగించబడిన, పి. సి. జోషీ, పుచ్చలపల్లి సుందరయ్యవర్గం తిరిగి నాయకత్వం హస్తగతంచేసుకోడానికి యత్నిస్తున్నారు. వీరిని ఇదివరలో రణదీవ, చంద్రరాజేశ్వరరావువర్గం, "మధ్యతరగతికి చెందిన పిరికిపందల"నీ, "విప్లవపంథా తెలియని రిఫార్మిస్టుల"నీ నిందించారు. ఇప్పుడు జోషీవర్గం రణదీవె వర్గాన్ని "ట్రాట్స్కీయిస్టు—టిటోయిస్"లనీ, "సాహసపదర్శనం కోసం విధ్వంసకచర్యల ననుసరించి పార్టీని నాశనంచేస్తున్న మధ్యతరగతి యోధుల"నీ నిందిస్తున్నారు.

పార్టీని విస్తరింపచెయ్యడానికి సమాజంలోని బూర్జువావర్గాలు తప్ప తదితర వర్గాలన్నిటినీ, (ధనవంతులైన రైతులు, గుమాస్తాలు మొదలైన పెటీబూర్జువాలను కూడా) చేర్చాలని కామిన్ఫారమ్ పత్రిక ఆదేశమివ్వడంతో, "మేమంటున్నదీ అదే" అని ఉభయవర్గాలవారూ అంటున్నారు. తరుణంవచ్చినప్పుడు గొరిల్లా దళాల్ని, "జాతీయస్వాతంత్ర్య సమరానికి సైనికదళాల్ని" నిర్మించాలనే విషయంపైనా, రైళు పడగొట్టడం, పరిశ్రమల్లో వ్యవసాయంలో ఉత్పత్తి తరిగించడానికి గూఢ విధ్వంసకచర్యలవలంబించడం పైనా, ఉభయవర్గాలమధ్యనూ అభిప్రాయభేదం లేదు. ఎటొచ్చీ ఆతరుణం వచ్చేసిందని రణదీవెవర్గంవారు చెప్పి వెంటనే విధ్వంసకచర్యల్లోకి దూకారు. జోషీవర్గం ఇంకా తరుణం రాదలేన్నారు. చాటుగా తాము జరిపే విధ్వంసకచర్యల నిందని ఏసోషలిస్టులపైనో మరొకరిపైనో తోసేసి, పైపైకి ప్రాథమికస్వత్వాల రక్షణ సమావేశాలు, ప్రపంచశాంతిసాధక సభలు, కార్మికజనహిత సర్వపక్షసమావేశాలు, మహిళాభ్యుదయసమాజాలు మొదలైన ఏర్పరచి [illegible] ఆందోళనలు కొనసాగించాలని జోషీవర్గం అభిప్రాయం. సమ్మెలు సభలు సమాజాలు సమావేశాలద్వారా పార్టీ అన్నివర్గాలలోకి ప్రవేశించి ఎప్పటికేది ప్రస్తుతమో వాళ్లచేతనే చేయించి, ఎప్పుడైనా వీపు కానుకోవలసివస్తే వాళ్లవీపే ఒప్పగించాలని వీరి యత్నం. ప్రభుత్వం చేస్తున్న ఘోరాలకి సహించలేక ప్రజలే తిరగబడ్డారని ప్రచారం చెయ్యాలి. అలా కాకుండా దాపరికం లేకుండా చెప్పిమరీ దెబ్బతీస్తే ఎలా ఉంటుందోనని రణదీవవర్గంవారు ప్రయోగించి చూశారు. చుక్కఎదురుతిరిగే సరికి వెనక్కి అడుగు వెయ్యవలసివచ్చింది.

ఈ రీతిగా వ్యూహాలు ఫిరాయించడం అవసరమైనప్పుడు తప్పలేదన్నాడు లెనిన్. ఈ ఫిరాయింపులో ఎవర్నితిట్టి వెనక్కి గెంటేసి రాజకీయంగా హత్యచెయ్యవలసి వచ్చినా అందుకు వారు తలొగ్గి ఉండవలసిందే. లెనినిస్టుతంత్రజ్ఞులైన కమ్యూనిస్టునాయకులు ఇలా తిట్టించుకోడానికి సిద్ధంగానే ఉంటారు. పార్టీ అవసరం కోసం తిట్టించుకుని వెళ్లగొట్టబడినా పార్టీని అంటిపెట్టుకున్నవారే సరైన లెనినిస్టులన్నమాట. అది భరించలేనివారు పార్టీని విడిచిపెట్టి కమ్యూనిస్టుల సిద్ధాంతాల్నే దుమ్మెత్తిపొయ్యడం పరిపాటిఅయింది. కాని జోషీ సుందరయ్యలు పార్టీపట్ల శ్రద్ధాభక్తుల్ని విడిచిపెట్టలేదు. కాబట్టి పార్టీ అవసరంనిమిత్తం వీరు తిరిగి నాయకులైనా ఆశ్చర్యపడనక్కరలేదు.

అయితే జోషీవర్గం నాయకత్వంలోకి వచ్చినంతమాత్రాన పార్టీ మూలతంత్రంలో తేడా ఉంటుందనుకోడం పొరపాటు. ఉభయవర్గాల ఆశయాలు, తంత్రాలూ ఒకటేననేమాట మర్చిపోకూడదు. తరుణం ఎటువంటిదో పరిశీలించి ఆ ప్రకారం పైకి ఏముఖకవళిక పెట్టుకొని తిరగాలనే విషయాన్ని నిరయించడానికే నాయకత్వాలు పైపై కార్యక్రమాలూ మారతాయి. త్వరలోనే ఎన్నికలు రానున్నాయి కాబట్టి అటువంటి మార్పు అవసరమని అంతర్జాతీయ కేంద్రం భావించి ఉండవచ్చును. ఈనాడు దేశంలో జోషీ సుందరయ్య వర్గానికున్న పరపతి రణదీవె రాజేశ్వరరావు వర్గానికి లేదు. విధ్వంసకచర్యలమూలంగా ప్రజలకు కమ్యూనిస్టులంటే హీతవు తప్పింది. కాబట్టి పోయిన పరపతి తెచ్చుకోడానికి, ఎన్నికల్లో అవసరానికి జోషీవర్గం తిరిగి నాయకత్వంలోకి రావచ్చును.

కార్యక్రమాన్ని విస్తరించడం అంటే సోషలిస్టులకి బాగా అనుభవమే. 1939 లో సోషలిస్టుపార్టీ కమ్యూనిస్టుపార్టీ విడిపోయాయి. అప్పుడు ఆంధ్రదేశంలో బలంగా ఉన్న రాష్ట్రకాంగ్రెస్ సోషలిస్టు పార్టీ మొత్తంగా కమ్యూనిస్టుపార్టీ హస్తగతమైపోయింది. ఈనాటికీ ఆంధ్రదేశంలో సోషలిస్టుపార్టీ తేరుకోలేదు. ఈ జోషీవర్గం నాయకత్వంలోకి వస్తే శాంతిఏర్పడుతుందనుకోడం పొరపాటు. 1942 లోనూ దేశవిభజన సందర్భంలోనూ జోషీపార్టీచర్యలు మరువరానివి.

కమ్యూనిస్టులు రంగంలో ప్రవేశించకముందే "విస్తృతకార్యక్రమ"విధానం, అంటే అన్నిరంగుల వామపక్షరాజకీయ సంఘాల్ని సమీకరించడం తమకెంత ఫలిస్తుందో చూడాలని సోషలిస్టులు ప్రయత్నిస్తున్నారు. జయప్రకాశ్ నారాయణగారు పార్లమెంట్‌లోనూ, రాష్ట్రశాసనసభల్లోనూ ప్రభుత్వానికి ప్రతికూలపక్షాన్ని నిర్మించదలచినట్లు ప్రకటించి కాంగ్రెసేతర రాజకీయపక్షాలన్నిటినీ ఒకసమ్మేళనానికి ఆహ్వానించారు. ఇదేదైనా ఒనగూడితే, కాంగ్రెస్ప్రభుత్వాలకీ, సంఘాలకీ వచ్చిన అప్రతిష్ఠ పురస్కరించుకుని వచ్చే ఎన్నికల్లో ప్రత్యాధికారం కాకపోయినా కనీసం ప్రతికూలపక్షం స్థాపించవచ్చుననుకున్నారు. కాని వీరితో సమ్మేళనానికి సిద్ధపడే పక్షాలు ఆట్టే కనిపించలేదు.

## రచ్చకెక్కిన కాంగ్రెస్ *

పంచాయతీ ఎన్నికల పుణ్యంవల్ల కాంగ్రెస్ మొట్టమొదటిసారిగా కోర్టుకెక్కింది. కార్యదర్శి కళా వెంకట్రావుగారు బోనెక్కవలసివచ్చింది. ఉత్తరకలకత్తా జిల్లా కాంగ్రెస్ అధ్యక్షుడు కార్యదర్శితగవులాడి అన్నివార్డుల్లోనూ ఎవరి కమిటీల్ని వారు ఏర్పాటు చేసుకున్నారు. నామినేషన్ దరఖాస్తుఫారాలు ఒకరికే చిక్కాయి. దాంతో ఎన్నికల్ని నిలుపుదల చేయించాలని కోరుతూ ఒకవర్గం రాష్ట్రకాంగ్రెస్‌కు విరుద్ధంగా కలకత్తా హైకోర్టులో పిటిషన్ పెట్టారు.

మనరాష్ట్రంలోకూడా రాజమండ్రి మొదలైనచోట్ల అక్కడక్కడ రెండేసి కాంగ్రెస్ కమిటీలు ఏర్పడ్డాయి కాని,

# నేటి ప్రపంచం

## కొరియాలో అంతర్యుద్ధ ప్రజ్వలనం *

ఇండో చీనాలో అంతర్యుద్ధానికి బావో డాయ్ ప్రభుత్వంతరఫున అమెరికా వద్ద ఆయుధసామగ్రి తెచ్చి ఫ్రెంచి సైన్యాలు సన్నాహం చేస్తున్న సమయంలో, అకస్మాత్తుగా అంతర్యుద్ధం కొరియాలో ప్రజ్వలించింది. ఇండోచీనా, ఫిలిప్పైన్స్, ఫార్మోజాలలో వలెనే కొరియాలో కూడా యుద్ధసన్నాహాలు చిరకాలంగా జరుగుతూనే ఉన్నాయి. అమెరికా ఆయుధ సామగ్రి సప్లైకి ఇండోచీనా ప్రధానంగా పరిగణించబడింది.

1945 లో కొరియాలో జపాన్ వారి ఆక్రమణ అంతమయింది. దక్షిణాన అమెరికన్ సైన్యాలు, ఉత్తరాన రష్యన్ సైన్యాలు ఆక్రమించాయి.

ఉభయసైన్యాలూ ఇంజిన్ నది ఉత్తర భాగాన 38 వ అక్షాంశాన్ని సరిహద్దుగా నిర్ణయించుకొన్నాయి.

కొరియాభవిష్యన్నిర్ణయంపైన ఐక్యరాజ్యసమితిలో ఏకాభిప్రాయం కలుగలేదు. సమితిధర్మకర్తృత్వప్రతిపాదన నిరాకరించబడింది. కొరియాలో శాంతి కాపాడ్డానికీ, దేశసమైక్యతకు తరుణం చూసి ఉభయ ప్రాంతాల అధికారులమధ్యనూ రాయబారాలు నడపడానికీ సమితివారు ఒక కమిషన్ నియమించారు. కమిషన్ నియామకానికి అమెరికా అంగీకరించింది. కాని రష్యా అంగీకరించలేదు. కమిషన్ దక్షిణ కొరియా ప్రధాననగరమైన సియోల్ లో కార్యాలయమేర్పరచుకుంది. ఉత్తరకొరియాలో ప్రవేశించడానికి కమిషన్‌కు అనుమతి దొరకలేదు.

ఉత్తర కొరియాలో ఒక కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని నెలకొల్పి రష్యన్ సైన్యాలు 1948 డిసెంబర్‌లో నిష్క్రమించాయి.

---

ఈ ఉపాయం అవకాశం ఇంకా అందరికీ చిక్కలేదు. కాంగ్రెస్‌లోని ఆయావర్గాల వారు జిల్లాలూ ఊళ్లు, వార్డులు పంచుకున్నారు అంతే. మన తగాదాల్లో గోకుల్భాయ్ భట్‌గారు మళ్ళీ కొత్తతీర్పు ఇచ్చారు. కాంగ్రెస్ అధ్యక్షులు డా. పట్టాభిగారి స్టే ఆర్డర్ ఆంధ్రరాష్ట్రానికంతకీ వర్తించదనీ, భట్‌గారి విచారణపైన ఫిర్యాదులు చేసిన చోట్ల మాత్రమే వర్తిస్తుందనీ వెంకటావుగారు స్పష్టపరిచారు. ఆ ప్రకారం, భట్‌గారి కొత్త తీర్పు ప్రకారం ఎన్నికల కార్యక్రమం కొనసాగాలి. అది అఖిలభారత కాంగ్రెస్ సమావేశం నాటికి పూర్తి అవుతుందో లేదో అంచనా అప్పుడే వెయ్యడం కష్టం. [సీతారామ్]



దక్షిణకొరియాలో సింగ్‌మన్‌రీ అధ్యక్షత క్రింద జాతీయప్రభుత్వాన్ని నెలకొల్పి అమెరికన్ సైన్యాలు 1949 జూన్‌లో నిష్క్రమించాయి. ఉత్తర కొరియానుంచి నిష్క్రమించేముందు లక్షమంది సైనికులకు సాయుధపోలీసులకు శిక్షణనిచ్చాయి. ఉత్తరకొరియా ఖనిజసంపదను కొని రష్యా ఆయుధ సామగ్రిని అమ్ముతున్నది. దక్షిణ కొరియాలో అమెరికన్ సైనికసలహాదార్ల ఆధ్వర్యంకింద నెలకొల్పబడిన సింగ్మన్‌రీ ప్రభుత్వం అమెరికావల్ల కోటి 20 లక్షలడాలర్ల ఆర్థికసహాయం, కోటి డాలర్ల ఆయుధసామగ్రిన్నీ తీసుకుంటోంది.

అమెరికా రష్యాలమధ్య కలహం ఫలితంగా విభజింపబడిన కొరియాలో సింగ్‌మన్‌రీ పార్టీకంటె జాతీయపక్షానికి అధిక బలం ఉంది. కాని జాతీయపక్షం కొరియా ఐక్యతతోపాటు అమెరికన్ పరిశ్రమలూ వ్యాపారప్రాబల్యం తొలగిపోవాలని కోరేది. ఆ పక్షానికి చెందిన నాయకుడు ఉభయప్రాంతాలనూ సమైక్యం చెయ్యడానికి ఆందోళన ప్రారంభించాడు. కాని ఆపక్షనాయకుడు 1948 లోనే హత్యపాలైనాడు. సింగ్మన్‌రీ ఈ హత్యకు కారకుడని కొరియా అంతటా ప్రవాదం బయలుదేరింది. అప్పటినుంచీ ఎన్నికలు జరపడానికి సింగ్మన్‌రీ భయపడి వాయిదా వేస్తూవచ్చాడు. ప్రజల్లో ప్రభుత్వంపట్ల అసంతృప్తి అధికమయిందనీ, సింగ్మన్‌రీ సాయుధపోలీసుబలం సహాయంతోనే అధికారాన్ని నిలుపుకోగలుగుతున్నాడనీ అమెరికన్ పత్రికలు వ్రాశాయి.

ఐక్యరాజ్యసమితివారి ప్రాచ్య ఆర్థిక సంస్థలో బ్రిటన్ అమెరికాల మద్దతుపైన దక్షిణకొరియాకే ప్రవేశం లభించింది. ఉత్తరకొరియాకు లభించలేదు. ఐక్యరాజ్యసమితికూడా అధికారరీత్యా దక్షిణకొరియా ప్రభుత్వాన్ని గుర్తించి కమిషన్ వ్యవహారాలు వారితో నడపాలని ఆదేశమిచ్చింది. రష్యాచీనాలు ఉత్తరకొరియానే గుర్తించి తమ సమావేశాల్లో ఆ ప్రభుత్వానికి సభ్యత్వమిచ్చాయి. రష్యావాణిజ్యఒడంబడిక కూడా చేసుకుంది.

మూడుకోట్ల జనాభాగల కొరియాలో అధికసంఖ్యాకులు దక్షిణ కొరియాలో ఉన్నారు. వారిభాష తార్తార్, మంగోల్ జపానీ భాషల మిశ్రమం. చీనీలిపినే వాడతారు. దేశం ప్రధానంగా వ్యావసాయికమైనదే. ఉన్న కొద్దిపరిశ్రమలు, ఖనిజపు గనులు ఉత్తరకొరియాలో ఉన్నాయి.

గతమాసం జరిగిన ఎన్నికల్లో స్వతంత్ర అభ్యర్థులుగా జాతీయపక్షవాదులు, కమ్యూనిస్టులు పోటీచేశారు. సింగ్మన్‌రీపక్షానికంటె స్వతంత్రఅభ్యర్థులకే అధికస్థానాలు లభించాయి.

కమ్యూనిస్టులు జాతీయవాదులు ఏకపక్షంగా ఏర్పడనందువల్ల సింగ్మన్‌రీ ప్రభుత్వాన్ని తొలగించి కొత్తప్రభుత్వం ఏర్పరిచే యత్నం జరగలేదు. కొత్తశాసనసభ సమావేశపరచబడలేదు. సింగ్మన్‌రీఆధ్వర్యంకింద పాతప్రభుత్వమే పరిపాలిస్తున్నది. గత ఏడాదిలో 20 లక్షలమంది కమ్యూనిస్టులు రహస్యంగా దక్షిణకొరియాలో చేరి గొరిల్లాచర్యలు నడుపుతున్నారని అంచనా వెయ్యబడింది. ఉత్తరకొరియాలో ప్రభుత్వానికి రష్యన్ టాంకులు, ఫైటర్, బాంబర్ విమానాలు కూడా ఉన్నాయి. దక్షిణకొరియా ప్రభుత్వానికి టాంకులూ విమానాలూ లేవు. నౌకాబలంలో కూడా దక్షిణకొరియా తీసికట్టే.

ఈ తరుణంలో ఉత్తరకొరియాప్రభుత్వం దేశసమైక్యతకోసం రాయబారాలు జరపాలని సూచించారు. దక్షిణ కొరియా ఎన్నికల్లో గెలిచిన స్వతంత్రఅభ్యర్థులతో సంప్రదింపులకు ముగ్గురు రాయబారులు సరిహద్దు దాటి దక్షిణకొరియా వచ్చారు. వారిని దక్షిణకొరియాప్రభుత్వం అరెస్టు చేసింది. ఈ ముగ్గురిలో ఇద్దరు దక్షిణ కొరియా ప్రవేశించినతరువాత కమ్యూనిస్టు పక్షంనుంచి విడిపోయినట్టు దక్షిణకొరియా ప్రభుత్వం ప్రకటించింది. అరెస్టుచేసిన వారందరినీ ఒప్పగించవలసిందని ఉత్తర కొరియాప్రభుత్వం అడిగింది.

తమ సరిహద్దులు దాటి దక్షిణకొరియన్ సైన్యాలు దురాక్రమణ ప్రారంభించినందువల్ల దేశరక్షణనిమిత్తం యుద్ధం ప్రారంభించవలసి వచ్చిందని ఉత్తరకొరియా ప్రభుత్వాధికారులు ప్రకటించారు. సియూల్‌నగరం పతనమైతే దక్షిణ కొరియాప్రభుత్వం పతనమైపోగలదని ఒక విదేశ మిలిటరీ నిపుణుడన్నాడు. దక్షిణకొరియాసైన్యాలు కమ్యూనిస్టుసైన్యాలతో పోరుతుండగా వెనకనుంచి కమ్యూనిస్టు గొరిల్లాలు యుద్ధం చేస్తున్నారని కూడా వార్తలు వస్తున్నాయి.

పరిస్థితిని వెంటనే లేక్‌సక్సెస్‌లో భద్రతామండలి భారతప్రతినిధి బి. యన్. రావుగారి అధ్యక్షతకింద సమావేశమై చర్చించింది. కాని చీనాసభ్యత్వవివాదహేతువుపైన రష్యా ఈ సమావేశంలో పాల్గొనలేదు. అమెరికాప్రతిపాదనపైననే ఉత్తర కొరియాసైన్యాలు వెంటనే యుద్ధం మాని 38వ అక్షరాంశంసరిహద్దుకి తిరిగిపోవాలని ఆజ్ఞ ఇచ్చింది. ఈ తీర్మానం అంతర్యం ఉత్తరకొరియాప్రభుత్వంపై దురాక్రమణ నేరం మోపినట్లే. సమితినిబంధనలప్రకారం దురాక్రమణనేరం ఒక ప్రభుత్వంపైన మోపబడినప్పుడు భద్రతామండలి ఆర్థికదిగ్బంధం విధించవచ్చు రాజకీయంగా అన్ని దేశాలూ బహిష్కరించాలని ఆదేశించవచ్చు. మిలిటరీ చర్యలుతీసుకోవాలనికొన్ని దేశాలను ఆదేశించవచ్చును. కాని వీటోఅధికారంకల రష్యా పాల్గొనని దేభద్రతామండలితీర్మానాలు చెల్లవు.

చీనాప్రభుత్వసమస్య పరిష్కారం కాకపోవడంకూడా ఉత్తరకొరియాకు తోడ్పడింది.

దక్షిణకొరియా తమకు సహాయం చెయ్యాలని అమెరికాను, జపాన్‌లోని అమెరికన్ ప్రతినిధి జనరల్ మెకార్థర్‌ను కోరింది. అవసరమైనఆయుధసామగ్రిని వెంటనేసప్లయి చెయ్యవలసిందిగా అమెరికన్ ప్రభుత్వం మెకార్థర్‌కు ఆదేశమిచ్చింది. సహాయం ఎంత ఉంటుందో, ఎటువంటి సహాయాన్ని అమెరికా ఇవ్వగలుగుతుందో, చెల్లని భద్రతామండలితీర్మానం ఆధారంగా అమెరికా ఎంతవరకూ కొరియా అంతర్యుద్ధంలో జోక్యం చేసుకోగలదో, వీనిపైన కొరియా అంతర్యుద్ధఫలితం ఆధారపడి ఉంటుంది. ఉత్తరకొరియాకు రష్యా చీనాల అపార బలసంపదల సహాయం ఉంటుంది. కొరియాలో దక్షిణప్రభుత్వానికి పరాజయం కలిగి దేశమంతా కమ్యూనిస్టుల పాలబడ్డం సంభవించినట్లయితే, ఈ ఓటమిప్రభావం అమెరికాలో నవంబర్ ఎన్నికలపైన ప్రసరించగలదు. చీనాలో ఓటమితో ఇప్పటికే అప్రతిష్ఠపాలై ఉన్న ట్రూమన్ ప్రభుత్వపక్షం దెబ్బతినవచ్చును. విదేశాంగమంత్రి ఎచిసన్ తొలగిపోక తప్పనిసరి కాగలదు. కమ్యూనిస్టులకు పరాజయం సంభవించేపక్షంలో గ్రీస్‌లోవలెనే అశాంతి అరాచకం నిత్యస్థితమై పోగలవు.

కొరియాలో అమెరికా,రష్యా ఉభయవర్గ బలాబలప్రదర్శ తృతీయప్రపంచసంగ్రామానికి దారి తియ్యవచ్చును. కాని ఫలితంకోసం ప్రపంచమంతా ఆత్రంతో నిరీక్షిస్తుంది.

[సూర్యనారాయణ]

నవల:




శ్రీ నోరి నరసింహశాస్త్రి

## 32

క్షణక్షణము పెరుగుచున్న ఆనందముతో నిప్పటికి పరవశతయే పొందియున్న కొప్పెరుంజింగడు తా నిప్పుడు చూచుచున్నది సమ్మతేకపోయెను. కోపముతో నా పండితులవంక నాతడు ప్రశ్నార్థకముగ జూచుచుండెను. తెర పడినది. రూపక ప్రదర్శనము పూర్తి కాలేదు!

గోదావరిపండితులు సంభ్రమముతో వెడలిపోవుచుండిరి. ఒకరితో చెప్పరు. అగరు. అందరును కూడబలుకుకొన్నవారివలెనే ఒక్కసారి బయలుదేరిరి. కాని యీ ఛాందసులు అట్లు ముందుగా కూడబలుకుకొని యుండుట కవకాశము లేదు. వారికి కోపమే వచ్చినది! కొప్పెరుంజింగనికిని కోపము వచ్చినది. అతడు రావణాసురుని వంటివాడు గదా! అతనికిని రావణుని కోపమువలెనే వచ్చినది. వాల్మీకి రావణునికి కోపము వచ్చినప్పుడు 'రేజుర్వింశతి దృష్టయః' అని వర్ణించెను. కొప్పెరుంజింగనికి రెండు కన్నులే యున్నను, అవియే ఇరువదికన్నులవలె మండినవి! అట్టి రావణుని కోపమును గూడ ఈ గోదావరిపండితుల కోపము అతిశయించినది. వారు కొప్పెరుంజింగని కోపమును లెక్కచేయలేదు! బయలుదేరిరి.

ఎక్కడికి వెళ్లగలరు? ద్వారపాలురు వారిని బయటికి పోనీయక యడ్డగించిరి!

వెర్రిరాలను నగ్రహారమున కగ్రణి యగు ఛాందసకవికేతన కొప్పెరుంజింగనిదిక్కు తిరిగి యిట్లనెను:

"మహాసంతోష మైనది, రాజసింహా, మహాసంతోషము! రంగస్థలమున మరణప్రదర్శనము చేయుటచే నీ కూడినసభ కంతయు నాశౌచము వచ్చినది. మమ్మను గోదావరిలో స్నానము చేయబోనిండు! ఇంత మహాపర్వమున నెంతపని జరిగినది! అయ్యో, యేమి యీ యాగడము! ఎంతసేపు ఈ మైలగుడ్డలతో నిట్లు పడి యుందుము!"

పుష్యమాసపు చలి! ఈ బ్రాహ్మణులు ఉపవాసము చేసిన శ్రమతో నున్నారు. ఉత్తరపుగాలి ప్రారంభమైనది. ఈ చలిలో ఈ రాత్రివేళ నిందరు గోదావరిలో స్నానమున కుపక్రమించుచున్నారు! కొప్పెరుంజింగని రాక్షసప్రకృతి ప్రకోపించినది. కోపము పట్టలేకపోయెను. అద్భుతమైన భరతవాక్యమంగళము నాకు ప్రాప్తము కాకుండ విఘ్నము కావించినారు. ఈ రూపకమున భరతవాక్యముగా [illegible]

"గాం పాతు నో నరపతిః శమితారిపక్షః"

మరియు దానికి తోడుగా పంచరాత్రమను మరియొక రూపకమునుండి యీ క్రింది శ్లోకార్థమును చదివింప కొప్పెరుంజింగడు సూత్రధారుని శాసించియుండెను.

"ఇమామపి మహీం కృత్స్నాం రాజసింహః ప్రశాస్తు నః!"

దాని కాతడక్కడి సామాజికుల యంగీకారము పొందదలచి యుండెను. అతని మహోత్సాహమును వీ రిప్పుడు భంగపరచియుండిరి. రూపకము త్వరలో పూర్తి కానున్నది. పావుగడియకూడ పట్టదు. భరతవాక్యపాద మంతముగా గల యొక్క శ్లోకమే మిగులు. ఈ బ్రాహ్మణులు తనకు సిద్ధముగా నున్న మంగళమును కాకుండ పాడుచేసినారు!

'ఈ రసహీను లగు నాంధ్రబ్రాహ్మణుల నందరిని ముక్కలు ముక్కలుగా నరకివేయింప నాజ్ఞాపింతును!!'

ఈవిధముగా నాజ్ఞాపింప నాలుకలో పలుకులు కదలుచుండెను. ఆ కోపావేశముతోపాటు, చిత్రముగా నొక భయావేశమును అతనిని పూనెను. స్నానము చేసి శౌచము నొందగోరుచు తొందరపడుచున్న యీ బ్రాహ్మణోత్తముల చాగస్తము చూచెను. వారందరు నప్పటికే తమ జన్నిదములు నివళముగా వేసికొనిరి. అతని కంతలో పట్టరాని నవ్వే వచ్చెను. వారి ముఖములలో వ్యక్తమగు స్నానవ్యగ్రతకు అతడు వికృతముగా నవ్వెను.

"వెళ్లండి!"

రాజసింహుని నోట నరికివేయుడని యాజ్ఞ వచ్చునను నూహతోడనే ద్వారపాలురు ఖడ్గము లెత్తి సిద్ధముగా నుండిరి. రెండు రెప్పపాట్ల కాలములో నా బ్రాహ్మణు లందరు నరుకబడి నరకలోకమునకు వెళ్లియుండెడివారే! రాజసింహుని యాజ్ఞ రాగానే భృత్యులందరు నొక్కసారిగా ఖడ్గములు దింపి దారి విడిచిరి.

బందె విడిచిన వృషభసమూహమువలెనే ఆ గోదావరిపండితు లందరు ఒక్కపెట్టున వసిష్ఠగోదావరికి ఆశౌచనివృత్తిస్నానమునకు సంభ్రమమున బయలువెడలిరి!

ఇక రూపకప్రదర్శనము సాగించుటా? తెరలోనుండి నటులు వచ్చుటకు సిద్ధముగా నుండిరి. సూత్రధారుడు కొప్పెరుంజింగని యాజ్ఞకై యెదురుచూచుచుండెను.

అట్టి సైగ చేయబోవుచు, కొప్పెరుంజింగడు తనతో వచ్చిన కన్నడ ద్రావిడపండితులవంక చూచెను. వారి మనస్సులును ఆందోళన చెందుచున్నవి. వారక్కడ మళ్లమీద కూర్చున్నవారై యుండిరి. గోదావరి బ్రాహ్మణుల ధర్మనిర్ణయము వారికిని ఎక్కినది. వారు నిర్వచించిన యాశౌచము వారి మనస్సులను పట్టినది. వారి యజ్ఞోపవీతములును నివీతములైనవి. కొప్పెరుంజింగ డిట్టిది జరుగునని కలలోకూడ తలపలేదు. అతని చూపు మూచి యా ద్రావిడ పండితులలో నొకడామాట ధైర్యము చేసి యనివేసెను.

కొప్పెరుంజింగనికి కాళ్ళాడలేదు. ఇట్టిది జరుగునని యాత డూహింపలేదు. అతనికి ధర్మమం దభిమాన మున్నది. దైవభక్తి యున్నది. యథాశాస్త్రీయముగా పూజ నిర్వర్తింపవలె ననునాస్థ యున్నది. అతనికే అనుమానము కలిగినది! "అయ్యో, కనకసభాపతిపూజ పూర్తి కాలేదే! అయ్యో!—మధ్యలో నాశౌచము వచ్చినది. కర్తవ్య మేమి?..."

పూజామధ్యములో వచ్చిన యాశౌచము పూజ పూర్తిగావించుటకు అడ్డువచ్చునా? ఇది యదాంతరముగా వచ్చినది కాదు; భరతప్రయోగముచే చేతులార తెచ్చిపెట్టుకొన్నది. ఇది చూచిన నటరాజస్వామి ప్రీతుడై యుండునా? ఆ మహాదేవునికి, నితాంత శ్మశానసంచారికికూడ, మనతోపాటు ఆశౌచము రాదా? కొప్పెరుంజింగడు ఈ సందేహములతో చూడగా ఎదుర నున్న నటరాజస్వామి కళావిహీనుడైనట్లు కన్పించెను.

"అయ్యో! ప్రదర్శనము పూర్తికాలేదు. నటరాజస్వామిని భరతప్రయోగ మవధరింపు మని అది పూర్తిచేయక లేచుటా? పూజ పూర్తిచేయుటా? పూజ పూర్తి కాకుండ లేచుటా?"

ఇట్లాలోచించుచు తన పురోహితునివంకను ద్రావిడాదిపండితులవంకను తిరిగెను. ద్రావిడపండితులును తానములాడ వ్యగ్రులై తమ యాసనములనుండి కదలుచుండిరి. అతని మాటలు నోటిలోనే నిలిచిపోయెను.

అతని శిబిరముబయట భయంకరనాదము లుప్పతిల్లెను. పరమ ప్రమాదము సూచించు ఘంటానాదములును శంఖనాదములును భేరీనాదములును కొట్టవచ్చినట్లు వినవచ్చెనవి. అవల సముద్రయుద్ధమును ఈవల నేలపై యుద్ధమును తన చుట్టు శిబిరరక్షణమును—ఈ మూడును తనకు ప్రతికూలము కానిది ఆ ఘోషలు వినరావు!

మహాధైర్యశాలి యగు కొప్పెరుంజింగనికి భయమే ఆవేశించినది. తాను ఉదయమునుండియు జనకమహారాజు నంతవాడ ననుకొనెను. అట్లుండవలె ననుకొనవలె నని ప్రవర్తించెను. ఈ క్షణములో నది యంతయు ఒక్కసారిగా నతడు మరచిపోయెను.

నాటకము పూర్తికాలేదు. భరతవాక్యము చెప్పలేదు. ఇష్టదైవతసాయంకాలపూజ పూర్తి కాలేదు. వ్రత సమాప్తి కాలేదు. తాను ఆహ్వానించిన భూమిసురుల పూజ కాలేదు. ఆ పూజామందిరము వెలుపల కవచితమై సర్వాయుధసజ్జితమై యున్న తన మత్తగజము నాత డధిరోహించెను. అత డేమి చేయునో తెలియక యాతని పురోహితుడు వెంటనడచియుండెను. ఆతడు గజారోహణ మంత్రము ప్రారంభింపకమున్నే, కొప్పెరుంజింగడు దానిపై నుత్తరముతో నెక్కివేసెను.

[illegible]

మరింత తీవ్రము చేయుచున్నాడు. ఉత్తరపుగాలి జనులను వడకించి వేయుచున్నది.

కొప్పెరుంజింగని శిబిరమంతయు నల్లకల్లోలముగా నున్నది. అత డేకాంతముగా నున్న శిబిరమునే పెద్ద యశ్వదళ మొకటి తాకినది. దాని నాతని సైనికులు ప్రతిఘటించుచున్నారు. కాని శత్రు ప్రోద్బలమును వారాపలేకున్నారు. యేమి చేయుదునో, ఎటు పోవుదునో తోచక అత డాలోచించుచు నొక్కక్షణము మాగెను.

అశ్వికవార్తాహరు డొక్కడు యుద్ధవార్త తెచ్చెను. "ఆంధ్ర గజముల కిప్పుడు నూతనశక్తి వచ్చినది. మన యశ్వదళములు విచ్చిపోయినవి. మన సేనానాయకులు వాని నాపలేకున్నారు!"

ఆ వార్తాహరుని వెంటనే మరియొక వేగరి వచ్చి, సముద్ర యుద్ధములో చోళనావలు కాకతీయనావలకు తాళలేక మునిగిపోయినవి పోగా, తక్కినవి పారిపోయిన వనియు, వాడరేవులోనికి కాకతీయనౌకలు విజయగర్వముతో ప్రవేశించుచున్న వనియు, మరియొక వార్త తెలిపెను.

తన శిబిరమును ముట్టడించిన యశ్వదళముకూడ, అన్నియాటంకములను అతిక్రమించి, లోనికి త్రోసికొని వచ్చుచుండెను. వెంటనే రాజసింహుడు తన ప్రధానపరివారమును తరులపై వసిష్ఠగోదావరి నుత్తరింప నాజ్ఞాపించి, యతడు తన మత్తగజమును ఏకాంత స్థలమున గోదావరిలో దింపెను. పాతికగజములు ప్రవాహమధ్యమునకు పోయి యాత్మ[illegible]డించుక వెనుదిరిగి మాచెను. అతని పరివారమును రాణివాసజనమును పడవలలో బయలుదేరవలసియుండెను. కాని పడవలు బయలుదేరుచున్న జాడయే లేదు. చూడగా నీవలియొడ్డున పడవలే లేవు! ఐదువందలకు పైగా అత డిటువైపున నదీతరణమునకు పడవలు సమకూర్చి యుంచెను. అం దొకటియు నిప్పు డిటువైపున లేదు! ఏమైనవి? తన పరిజనమును ఎట్లు రాగలదు?

చూచుచుండ నాతని పరిజనులు కాని పడవలు కాని యాతనికి కనిపింపలేదు. కాని, ఆతడు వదలిన యొడ్డుపై నొక యాశ్వికుడు చూడనయ్యెను. అత డెక్కినది సామాన్యాశ్వము కాదు. ఆ యెక్కినవా డెవరో మహారాజై యుండవలెను. అతడును నీటిలో ఎవరికొరకో వెదకుచున్నట్లు కనిపించెను. తన్నే వెదకుచున్నాడేమో! ఇటు నటు నొడ్డుపై నాతడా యశ్వమును కొంత త్రిప్పెను. అంతలో నాతడు కొప్పెరుంజింగని గజమును నీటిలో నుపలక్షించినట్లున్నాడు! ఆ యాశ్వికుడు వెంటనే నోట నురుగులు గార్చుచున్న తన యాజానేయమును వసిష్ఠగోదావరిలోనికి దింపెను. అదియు చురుకుగా నీదుకొనివచ్చుచున్నది.

అది చూచి కొప్పెరుంజింగడు తన మత్తగజమును వెనుకకు త్రిప్పెను. ఆ యోధుని తురగమును సమీపించినది. అప్పుడా వసిష్ఠ గోదావరీ ప్రవాహమధ్యమున, గజ మధిష్ఠించియున్న కొప్పెరుంజింగనికిని, ఆ యాశ్వికునికిని ద్వంద్వయుద్ధము ప్రవర్తిల్లెను.

ఆ యేనుగు పెద్దగా ఘీంకరించి, తొండ మెత్తి యాహయమును దానిపై నాశ్వికుని నొక్కవలమైన మోదు మోదబోయెను. ఆ సుత్రము హేషచేయుచు మెలకువగా ప్రక్కకు తొలగినది. సూదిమోపుమేర నా దెబ్బ తప్పెను. అప్పుడే ఆయాశ్వికుడు, ఆ గజమును కవచముచే ననావృతమగు భాగము వెదకి

(40 వ పేజీ చూడుడు)

# రవీంద్రనాథ ఠాగూరు

మూలం :
## ప్రొఫెసర్ సర్వేపల్లి రాధాకృష్ణ

అనువాదం :
## శ్రీ భాస్కర్

రాజులకంటె, వంశాలకంటె కూడ యెక్కువ కాలం జీవించడం మహాసారస్వతవిలక్షణవైశిష్ట్యం. వంశాలకంటె వర్గాలకంటె కూడ మానవ ఆధ్యాత్మికశక్తి ఎక్కువ కాలం నిలుస్తుందని చరిత్ర సాక్షీకరిస్తుంది. హోమరు రాజకీయప్రపంచం నశించింది; కాని అతని సంగీతం యీనాటికీ సజీవమే. రోమువైభవం అంతర్హితమయింది; కాని వర్జిలు కావ్యం యింకా శక్తిసమన్వితంగా ఉంది. కాళిదాసు కలలు మానుషసంబంధబాహ్యబాధాభావంతో సజీవకంఠనాదంలాగు. మనలని కదలిస్తాయి; కాని అతను అలంకారప్రాయంగా ఉన్న ఉజ్జయినీనగరం స్మృతిపథాన పడింది. మధ్యయుగ మహారాజులంతా మరవబడ్డారు; కానీ డాంటే కవిత్వం హృదయంగమమయింది. ఆంగ్లభాష నిలిచినంతవరకు షేక్స్పియరు మూలంగా "ఎలిజబెత్తుయుగం" కూడా నిలుస్తుంది. మన ప్రభువులూ, పథప్రదర్శకులు విస్మృతిలోనికి పయనించినప్పటికీ ఠాగూరు తన సంగీతసాహిత్యాలతో మనలను ఆనందపరుస్తూనే ఉంటాడు. అతను భారతీయుడే, కాని అతని కావ్యమూల్యం దేశీయజాతీయగుణాతీతం విశ్వవిస్తృతలక్షణాలలో, మధురజీవితచిత్రణలో, సభ్యతా ఔన్నత్యంలో అతని కావ్యాలు అమూల్యాలు.

ఈ పరివర్తనసమయంలో రవీంద్రుని కంఠం చాలమంది యువకభారతీయులకు శాంతిస్ఫూర్తిప్రదాయకం. మనం పరాజిత ఆశాభారంతో క్రుంగిపోయి, శాస్త్రసంఘ విజయాలవైపు నిర్విణ్ణులమై నిలిచి చూచేటప్పుడు - మన మనస్సులు స్థైర్యం గోల్పోయి నిర్ణయశక్తిహీనములైనప్పుడు మన హృదయంలో ఆశను, మస్తిష్కంలో ధైర్యాన్ని పాదుగొల్పుతూ అతను మన దగ్గఱికి వస్తాడు. మన శిరస్సులు రక్తం స్రవిస్తున్నా, అవి క్రిందికి వంగలేదని చూపిస్తాడు. విజయం విభవశక్తి సంపదల ఔన్నత్యాన్ని బట్టి గణింపరానిది. నాగరికతకు నిజమయినపరీక్షలు - ఆధ్యాత్మికోన్నతి; బాధాశక్తి. సంపద, శక్తి, సామర్థ్యం - యివి జీవితాంగాలుమాత్రమే; జీవితమెంతమాత్రం కావు, భావప్రయుక్తప్రత్యేకవిషయాలు వైయక్తికాలు. అవి వ్యవస్థావైజ్ఞానికాలకు అందవు.

సర్వజీవితానికీ, సాంఘికవ్యవస్థకీ కేంద్రమయిన ఆత్మమూల్యనిర్ధారణలో రవీంద్రనాథుడు భారతభావుకసుదీర్ఘపరంపరలో ఒక్కడుగా నిలుస్తాడు. అతనిలో సనాతన భారతనాదం నవనవోన్మేషంగా మనం చూడగల్గుతాం. అదృష్టంలో ఒడుదుడుకులున్నా, చరిత్రలో సుడులు తిరిగినా, భారతదేశం తన ప్రధానశక్తిని ప్రాణవంతంగా నిల్పుకొంది. మానవుని ఆత్మను భౌతికశరీరమని కాని, వివేకమనిగాని పొరపడరాదు. తెలివికంటె, మేధస్సుకంటె, శరీరంకంటె లోతయిన విషయం మరొకటుంది. అదే సత్యశివసుందరసమైక్యమైన సత్యపదార్థమగు ఆత్మ. దానిని లక్షించడం, సజీవప్రమాణం గావించుకోవడం ధర్మధ్యేయం; శౌచప్రేమశక్తుల ద్వారా ఆ బ్రహ్మపదార్థంతో అద్వైతభావాన్ని పొందేట్టు శిక్షించడమే న్యాయశాస్త్రాల ఆశయం; ఆ శాశ్వత పదార్థానికి అనువుగా రూపొందడమే మనం మనసుందరప్రకృతిని జీర్ణం గావించుకోవడం. మానవుడు సంపాదించవలసింది కేవల యాంత్రికనైపుణ్యం కాదు. ఆత్మాధిక్యత.

మనం చీకటిలోకి నడచి శాశ్వతజాగ్రతంగా ఉండే చుక్కలను చూచినప్పుడు వాటి సుదూరస్థితికి అబ్బురపాటు - వాటి నిశ్చలస్వరూపం ముందు సంపూర్ణ విలయం - వాటి ఔన్నత్యం ముందు అనామకత్వం అనుభవిస్తాం; హృదయం స్పందించడం మానుతుంది; శ్వాస తాత్కాలికంగా నిరోధింపబడుతుంది; మనం యావత్తూ దెబ్బతింటాం. మన అల్పమయిన ఆశలు, అభిలాషలు దీనాతిదీనంగా, నికృష్టంగా కన్పిస్తాయి. మహా కవితాశ్రవణం చేసేటప్పుడుగాని, మానవాంతరంగావలోకనం చేసేటప్పుడుగాని, సరిగా అదేవిధమయిన వ్యథ, శ్వాసలో అదేవిధమయిన స్తబ్ధత కన్పిస్తాయి. తత్వమూ - ధర్మమూ, కళా - కవిత్వమూ యీ ఆంతరంగికజ్ఞానసముద్ధరణకే వినియోగపడతాయి. మనం జీవితంలో యీ ప్రబంధాన్ని నిర్లక్ష్యం చెయ్యడం మూలంగానే యింత మేధోసంబంధితాభివృద్ధీ, వైజ్ఞానికప్రగతీ ఉన్నప్పటికీ - యీనాడు మనం యింత చాంచల్యాన్నీ, సంక్షోభాన్నీ, వినాశనాన్నీ చూస్తున్నాం. మూడు శతాబ్దులపాటు జరిగిన శాస్త్ర పరిశోధనలు - ప్రతిష్ఠాపనలు సముగ్గతసంపదను సంపాదించాయి; కరవులు కరవయినై; జనాభా అభివృద్ధి చెందింది; ప్లేగు మొదలయిన దురంతవ్యాధులు కూడా లొంగుబాటుకు కొనిరాబడ్డాయి. సాంఘికవ్యవస్థపైన నమ్మకమూ, భద్రతాభావమూ ప్రపంచమంతటా వ్యాప్తమవ్వడంవల్ల, వైజ్ఞానికయాంత్రిక పరిధుల్లో విజయసాధనకు ప్రముఖంగా బాధ్యమైన జిజ్ఞాసాభావం, పరీక్షణతత్వం అంతకంటె లోతయిన జీవితఘట్టాల్లోకి పెంపొందాయి. లోకం అనిర్వచనీయ, అద్భుత, ఆనందాలనుంచి కొల్లగొట్టబడింది. ఒక కొత్త కర్కశపసుప్రపంచం హృదయాధిక్యతకు ప్రధానములయిన ప్రణయసౌఖ్యసౌందర్యాలకు భిన్నతత్వంతో, శాస్త్రవిజ్ఞానంతో, పెద్ద వ్యాపారంతో తలయెత్తింది. అనాత్మవాదం, అజ్ఞేయవాదం, అధునాతన ఆలోచనలకు ఆటపట్టయినై. విశ్వానికి వెనుక యేదయినా పదార్థం ఉందా - అని అనుమానించే అనాత్మవాదులు, అజ్ఞేయవాదులు; విశ్వానికి వెనుక బ్రహ్మాండశక్తి సమన్వితమయిన సత్యపదార్థం ఉందనే ఆధ్యాత్మికవాదులు—ఈ యిరువురికీ మధ్య

కథానిక :

# పెండ్లిపూట

శ్రీ వేటూరి ఆనందమూర్తి

వేసవిఇరవైతొమ్మిదో తేదీ తిరుపతిలో మా చెల్లెలు పెళ్లి. ఇంకా పది హేనురోజు లుండగా నేనూ మా అన్నయ్య యింటికి వచ్చేము. ఇల్లంతా బాగా హంగామాగా ఉంది. సున్నాలు వేయిస్తున్నారు. నేలమీద, గోడలమీద, ఎక్కడెక్కడ బీటలువారినయ్యో అక్కడల్లా సిమెంటూ అదీ వేయడం - అంతానూ - ఇల్లంతా రిపేర్లే! ఇల్లంతా సున్నపుమరకలే! గోడసున్నం ఆరిందో లేదో అప్పుడే దానినిండా గీతలు. మా పెద్దక్కయ్యపిల్లలూ వాళ్లూ అప్పటికి వారంపది రోజుల క్రితమే వచ్చారుట. ఇంట్లో మా పెద్దన్నయ్యపిల్లలున్నారు. వారూ వీరూ కలిసి నానాబీభత్సమూ చేస్తున్నారు. పనివారు గోడకు పెల్లలేసి నల్లడను తిరువాయి. ఈ కుఱ్ఱవారంతా కలసి-రైలుబండి ఆటట-గోడంబడే గీతలు గీసుకొంటూ, కూతలు కూసుకొంటూ ఇల్లంతా ఒకటే తిరగడం. ఆ సున్నమంతా కాళ్లకు మొగాలకు పులుముకోవడం-నలుగురికీ పామి రావడమూ-నానాఅల్లరి చేస్తున్నారు. ఇల్లంతా గందరగోళంగానూ-చీదరగానూ ఉంది. దండెంనిండా బట్టలే-వరసా వానీ లేకుండా గదులనిండా అడ్డదిడ్డాలుగా అన్నీ పెట్టెలే పోనీ అవతలిగదిలోకి వెడదామా అంటే మెంతుల చేటలూ, మినప్పప్పు చేటలూను. ఆటి కదిలితే ఆవకాయజాడీలు, అమూల గుస్తే విస్తరాకుదిళ్లు, ఇంట్లో కాలు నిలిపేందుకు చోటు లేదు! రైలునుండి అప్పుడే దిగిరావడంవల్ల ఒళ్లంతా తలంతా దుమ్ము-ఆ రైలుబొగ్గూ అదీ అసహ్యంగా ఉంది. వెంటనే దొడ్లోకి వెళ్లాను స్నానానికి. అక్కడ ఒక్కబొట్టు నీరుంటే ఒట్టు. ఎండ మాత్రం కాస్తోంది. "స్నానానికి నీళ్లు లేవుట్రా?" అని కేకేశాను. "నూతిలో నీళ్లుతోడిపోసు కోం" డని సమాధానం వచ్చింది. 'ఏమీ కొళాయ యేమైంది?' అది ఉండీ ఒకటే లేకా ఒకటే-అప్పుడప్పుడు మానమాత్రంగా వస్తాయిట. ప్రొద్దున్నో అరగంటా-సాయంత్రమో అరగంటా-అంతటితో బంద్. నారాయణ! నాపని కంగారైంది. ఇన్నాళ్లూ హాయిగా [illegible]-ఆ దివ్య[illegible] వేసవికాలం శెలవలు సగానికిపైగా గడిపేము విశాలానికివిశాలము-ఏకాంతాని కేకాంతము అబ్బ' ఎంత బాగుండేది! ఇంటిప్రక్కనే ఏనాటికీ ఎండిపోని ఆ దివ్యకృష్ణాప్రవంతీ ప్రవాహము. అబ్బ! ఎంతసేపు పోసుకొన్నా నీరుమాత్రం సమృద్ధిగా ఉండేవి. అన్నీ వసతులే-అది కృష్ణాజిల్లా-ఇదో?...ఆ నూతిలో నీళ్లే యిన్ని తోడి పోసుకొన్నా.

"పెండ్లి పదిదినాలు లేదు-ఏంది స్వామి పోరమాడిరి నేను తిరిగితిరి!" అన్నాడు తాపీ పనిచేస్తున్న మేస్త్రీ. ఏదో సమాధానం చెప్పి లోపలకి వచ్చేను.

"అబ్బాయిలు యీనాటికికూడా రాకట్టయితే యిద్దరికి పేరా రెండు శుభలేఖలు పంపి ఉండేవాణ్ణి" అంటున్నారు నాన్నగారు నాకు వినబడేటట్టుగా.

ఇంకా ముందువచ్చిమాత్రం మేము చేసేదేముంది? కుఱ్ఱవాళ్లం. పైగా పెద్దవాళ్ల పనులకి అడ్డాలుతగులుతుంటాముకూడా. అయినా పనిచేసినా చెయ్యకపోయినా శుభకార్యవేళ ఇంటిపట్టున ఉండవలసిన నలుగురూ ఉండడం వారి వాంఛ" మూడుపాళ్లు మేము చేసేది ఏమీ ఉండదు-బందాలపనులు తప్ప! సరే-మళ్లా ఆ వాతావరణంలో పడటానికి కొన్ని గంటలు పట్టింది నాకు.

ఆ పనీ యీ పనీ చేస్తూనేఉన్నారు. అప్పుడే ఇరవైనాలుగు వచ్చేసింది మా పినతండ్రిగారు వారు సకుటుంబంగా వచ్చేరు. ఇల్లంతా బలేసందడి. ఇంటికి పక్కనిల్లుకూడా మాయింటివారిదే! యింటివారు భార్యనీ



జరిగే సంఘర్షణలో కడపటివాళ్లలో వాడు రవీంద్రుడు.

భారతీయతాత్త్వికుడు సోక్రటీసును కలుసుకున్నప్పటి కథ ఒకటుంది. దీనికి కర్త ప్లేటోగాని, జెనోఫోనుగాని కాదు, క్రీ. పూ. 3 వ శతాబ్దానికి చెందిన "అరిస్టోక్సినిసు" నుంచి యిది వస్తూ ఉంది. సోక్రటీసు భారత తాత్త్వికుడిని చూచి తన పని మానవజీవితపరిశోధనాసంబద్ధ మని చెప్పాడనీ, అప్పుడు భారతీయుడు చిన్న నవ్వు నవ్వి దైవికవిషయాలను తెలిసికోలేనివాడు, మానుషవిషయాలను తెలుసుకోలేడని సోక్రటీసుకు చెప్పాడనీ అతడు వివరించాడు. యూరపుపాశ్చాత్యఆచారప్రకారం మానవుడు ప్రధానంగా తార్కికబుద్ధితో ఆలోచించి, ఉపయుక్త (యుటిలిటేరియన్) పద్ధతుల ప్రకారం పనిచేసే ఒక హేతువాది. ప్రాచ్యఖండంలో మేధస్సమర్థతకంటె హృదయగ్రహణం, కరుణాభావం ప్రథమగణ్యాలు. దానికి కారణం—మాట్లాడే వెయ్యిమందిలోనూ ఒక్కడు ఆలోచింపగలడు; యోజింపగల వేలకొలది మనుష్యుల్లో ఒక్కడు తిలకించి గ్రహించగల్గవచ్చు. ఈ అర్థం చేసుకునే అర్హతే మానవుడిని వేర్పరచి యేర్పరుస్తుంది.

భౌతికప్రవర్తకత, మేధస్సమర్థత మనలను తృప్తిపరచలేవు. మనకు విస్తృతంగా వ్యవసాయం ఉన్నా, సమర్థమయిన ప్రయాణసౌకర్యవిధానమున్నా, ప్రతి ఒక్కడికీ ఒక స్వంతవిమానమూ, రేడియో ఉన్నా, రోగాలన్నీ పూర్తిగా నిర్మూలింపబడినా, శ్రామికులు, పురస్కృతులూ - ఉచితవేతనాలూ పొందగల్గినా ప్రతి ఒక్కడు పచ్చటిపండు అయ్యేదాకా, జీవింపగల్గినా - యింకా మనకి తీరని ఆశలూ, కోరదగిన కోరికలూ ఉంటాయి. మనిషి కేవలం ఆహారంపైనగాని, జ్ఞానంపైనగాని, బ్రదుకలేడు. మనం సరిక్రొత్త, సమర్థమయిన శాస్త్రీయపద్ధతులపైన ప్రపంచాన్ని పునస్సంఘటితం గావించవచ్చు. దానినుంచి మానసంబంధపరమాణు ప్రవృద్ధ గతులను సమీకరించి అట్టడుగు పాతాళభవనాల్లో పనిచేసే వంటకత్తెలను, వార్తాహరులను మొదలుకొని సుందరహార్మ్యాల్లో చిట్టచివరి అంతస్తుపైన సుఖంగద్ది తీర్చుకుంటూ పురుషసమాజాన్నంతటినీ చీమలబారుగా మార్చడంలో కూడా విజయవంతమయిన నాగరిక స్త్రీవర్గందాకా ప్రతివర్గాన్నీ నిర్మాణం చెయ్యగల్గిన పెద్దవ్యాపార గృహాన్ని కట్టినా - యింకా కడముట్టని వాంఛలూ, శేషించిన కోర్కెలూ ఉంటాయి. ఆ క్రొత్త ప్రపంచపద్ధతిలో కూడా బిడ్డలు నవ్వడమూ, ఏడవడమూ సాగిస్తారు; స్త్రీలు ప్రేమిస్తూనూ, బాధపడుతూనూ ఉంటారు. పురుషులు దెబ్బలాడుతూనూ కష్టపడుతూనూ ఉంటారు. పురుషుని నిజమయిన గొప్పదనం వైఫల్యంలోనూ, అస్పష్టభ్రమలతో మిథ్యాప్రపంచంలో పరిశ్రమించడంలోనూ ఉంటుంది. మానవుడు ద్వంద్వగౌరవంగల ప్రాణి. అతను ఉభయ-ప్రత్యక్ష అప్రత్యక్షలోకలక్షణాలను స్వీకరిస్తాడు. అతడు స్వాభావికపద్ధతిలో ఒక అంశం కావడంవల్ల, సామాన్యజీవిగా బ్రతకడంలో అసంతృప్తిని కలిగించే భావాంకురం అతనిలో ఉంది. అతను నిజానికి "సరిహద్దుప్రాంత ప్రాణి" కేవలం తొలిప్రపంచానికే వినియోగింపబడే జీవితం అతనికి తృప్తి నివ్వలేదు.

మానవుడు తన దైనికకృషిలోనూ, నేలసేద్యం చేసేటప్పుడు, రాజ్యం పాలించేటప్పుడు, ధనసంపాదన చేసేటప్పుడు, అధికారసముపార్జన చేసేటప్పుడు అతను అతనుమాత్రమే కాడు. అటువంటి ఉద్యమాల్లో విషయాలు సన్నద్ధంగా ఉంటాయి. ధనసంపాదన, కుటుంబపోషణ పూర్తిగా కాలాన్నీ, బలాన్నీ, పీల్చేస్తాయి. శాశ్వత అగోచరవిషయాలకు అవకాశం లభించదు. లౌకికజనఆత్మసంతృప్తిని సంక్షుభితం చేసే కొన్ని సంఘటనలు, మాయాభావాన్నీ, అవిశ్వాసాన్నీ జనింపజేసే కొన్ని సంఘటనలు జరుగుతాయి. మృత్యువువలని విచారం, నిరాశవలని బాధ కల్గినప్పుడుగాని - ప్రేమనాశం గావింపబడ్డప్పుడుగాని - నమ్మకం ద్రోహం చెయ్యబడ్డప్పుడుగాని - జీవితం అర్థరహితమూ, సారహీనమూ అయినప్పుడుగాని మానవుడు నీలిమేఘాల చాటున అదృష్టవశాత్తు తనకర్థం చెప్పగల్గిన శక్తి ఉందేమో తెలుసుకోడానికి ఆకాశం వేపు చేతులు చాపుతాడు. "మహాంతం పురుషం ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్"

(34-వ పేజీ చూడుడు)

పిల్లల్ని పుట్టింటికి పంపడంచేత ఆయిల్లూ మాయిల్లే అయింది. అంతా గల్లంతే. మిత్రులు చాలామంది వచ్చేరు. ఇరవై నాలుగు దాటింది. ఇరవై అయినా దాటింది'

"ఊళ్లో అందరికీ శుభలేఖలు అందినాయిట్రా? దీక్షితులుగారి కిచ్చేరా?" అని ఏందుకో జ్ఞాపకంవచ్చి అడిగారు.

"అన్నయ్య ఏదో అవేళ రాసినట్టు గుర్తు' అన్నాను. వెళ్లి అడిగితే-'పెద్దతమ్ముడికి రాసిచ్చినట్టున్నారా. అడుగువాణ్ణి' అన్నాడన్నయ్య. శుభలేఖల లిస్టులో చూస్తే మరి దీక్షితులుగారి పేరు లేదందులో. రెండో అన్నయ్య నడిగితే 'ఆ శుభలేఖలసంగతే నే నెరుగను. ఆరోజు చింతపండు కొడితేనే...' అన్నాడతను, మా కీమలాట నాన్నగారు విన్నారు. కోపగించుకొన్నారు. ఇల్లంతా ఒక కొలిక్కి వచ్చింది.

'ఇప్పుడుమాత్రం మునిగిపోయిందేమిటి? వెళ్లి వెంటనే ఒక శుభలేఖ వారి కిచ్చిరండోయ్' అని సలహా ఇచ్చేరు మిత్రులు రాజుగారు. గబగబా ఒకటి రాసి పరుగున దీక్షితులుగారింటికి వెళ్లేను.

'అడడా—నాకు మొన్ననే వచ్చిందబ్బాయ్.' అన్నారాయన! ఇంటికి వచ్చి ఆయనపేరూ లిస్టులో ఎక్కించాము. 'ఏదో - పెండ్లిపూట హడావుడి!' అనుకొన్నాం అందరూ ఆతరువాత.

గంటలు గడుస్తున్నకొద్దీ గడబిడి హెచ్చుతోంది. ఆవేళ ఇరవై ఎనిమిది రాత్రి పదింటికి పెళ్లికొడుకువారు వస్తున్నారు ఊరికి. కాబోయే బావగారు చిన్నప్పుడెంత బియ్యం తిన్నాడో ఏమోగాని ఆరాత్రి పెద్దపెట్టున గాలివాన వచ్చింది. మాకు భయమేసింది. ఈ వానే తెల్లార్లూ కురిస్తే! ఏమున్నా ఉందీ? ఆఖరుకి పొయ్యిలో కట్టెలుకూడా బాగా మండవు ఏమో. మతి - కాని వర్షం మాత్రం దైవవశాత్తు ఆరాత్రే ఆగిపోయింది.

ఉదయం తొమ్మిదింటికి మహూర్తం. సరిగ్గా సుముహూర్తంవేళ నేనక్కడ ఉండి తమాషా చూడాలని ఉబలాటంగా ఉంది. అప్పు డేడు గంట! మా మేనత్త పిలిచింది - "మా బాబుగా, ఇదుగో నీ చెల్లికి జాకెట్టూ అదీని. కాస్త కుట్టించుకురా బాబూ, అయిదునిముషాలు. నిలుచున్న పాళంగా కుట్టిస్తాడు ఉత్తరుడ్డన్నా కుట్టించిస్తే బాగుంటుంది. పోనాన్నా." **అంటూ మొండిపట్టు పట్టింది.**

"అదంతా వల్లకాదత్తయ్యా, ఖరవా లేదు ఉత్తరుడ్డ యిస్తే. ఇప్పుడిచ్చినా మాత్రం తొమ్మిదింటిలోగా వాడు నీకు పట్టిస్తాడేం? ముహూర్తంవేళకి నే నిక్కడుండాలి. నేను పోను. పోను. పోను పోను..." అన్నా గట్టిగా.

'అయ్యో, యీమాట తెలిస్తే నేను మా ఊళ్లోనే కుట్టించుకొచ్చేదాన్నిరా. మా బాబుగా పోయిరా. మళ్లా తొమ్మిదింటికల్లా, అయినాసరే, అవకపోయినాసరే- తిరిగి వచ్చేద్దువుగానిగా.' అన్నది. తప్పదురా అనుకొని అదిపుచ్చుకొన్నాను. ఇంతలోనే యీ వార్త ఎలా ప్రాకిందో పెళ్లికొచ్చిన ఆడంగులంతా తయారైనారు తలోగుడ్డా చేతపుచ్చుకొని.

'ఇదుగో మామానాయినా - ఈ అంచు చేతికీనీ, ఈ అంచునడుముకీ వేయమను - అంతా యిదే కొలత. చేతికి యిన్ని మడత లక్కర్లేదులే...' ఏవేవో పేపన్లు చెప్పటం మొదలెట్టింది ఒకావిడ.

'ఈ చీరెఅంచు కాస్త కుట్టమని చెబుమా-'

'ఈ జాకెట్టు కాస్త త్వరగా యిమ్మని చెబుమా-' అంటూ నలుగురూ నన్ను చుట్టుముట్టేరు. 'సరే, అందరివీ ఒకేసారి తెండి' అని పుచ్చుకొని ఓమూట కట్టుకొన్నాను ఆసమూహంలోంచి బయటపడ్డా. వాకిట్లోకొచ్చేసరికి రాజుగారు కేకేసారు.

"ఇదుగో బాబూ - మీ బావగారు స్నానానికెళ్లారు. తుండుగుడ్డా బట్టా అవీ ఏదో చూడు బాబూ, త్వరగా వెళ్ళు' అన్నారు. ఈ మూట చంకనెట్టుకొని బట్టలగదికేసి వెడుతుండగా వంటమనిషి శాస్త్రులు ఎదురయ్యాడు.

'సార్ - వడలు చేసేదానికి ఉద్దిపప్పు కావాల. యిప్పుడు వానవేస్తేగానీ సాయంకాలానికి అవును. లేకుంటే నన్నంచి కాదు. స్టోర్ రూమ్‌కి పోయేసి బిరీన అంపియ్యండి' అని చాలా సీరియస్‌గా చెప్పేడు. చిటికలో వద్దామని స్టోర్‌రూమ్‌కి పరుగెత్తేను. అందులో ముని కూర్చున్నాడు - నన్ను చూడగానే అమాంతంగా బయటికురకబోతూ

'ప్రొద్దున్నించీ టిఫెను లేదోయి అందరూ తిన్నారుట - నువ్వు కాస్సేపు యిక్కడ కూర్చుంటే నేను వెళ్లివస్తాను' అన్నాడు తోటకూరకాడల్లే మొహంవేసుకొని.

'టిఫెనా' అరగేలే - మనమూ తినలేదు. అయిదునిముషాలలో నేనూ తిని వస్తా. అప్పైన నువ్వు వెడుదువుగాని' అని బయటికొస్తూ.

'మునీ - ఓయ్ మునీ - వారు స్నానాల గదిలో ఉన్నారుట. బట్టలూ అవీ పంపుతున్నారు. అదేదో ఈలోగా కాస్తచూడు' అని అతనికిపురమాయించి చంకనున్న మూట అక్కడ పెట్టి గబగబా ఫలహారాలు పెట్టే చోటుకి పరుగెత్తబోయాను - మార్గంలో వెంకటేశ్వరరావుగారు రడ్డుపడి -

'ఇదుగో అబ్బాయ్. వెండిగిన్నె కావాలట గంధం అదీ యియ్యడానికి. వెళ్లి త్వరగా తెచ్చిపెట్టు' - అంటూ ఉరికించేడు నన్ను. పరుగున వెండిసామానున్న గదిలోకి పోయాను. ఆ గదిలో ప్రత్యక్షమయ్యారు కోటయ్యగారు.

'అనందూ - తక్షణం వెళ్లి - శ్రీరాములు యింటిదగ్గర ఉంటాడు. వెళ్లి నేను పిలుస్తున్నానని వెంటనే పిలుచుకురా - త్వరగా రావాలి సుమా!' అని ముహుర్తానికి శ్రీరాములు లేకుంటే శీమైనా కదలదన్నట్టుగా అంత ఆతురతతో చెప్పేరు. చచ్చేంరా దేముడా-ఎక్కడి శ్రీరాములు యిల్లు - ఏమిటికథ! అయినా తప్పదు - అలస్యమూ కాకూడదు. వెండిగిన్నె మాట సగం చెప్పి చెప్పకుండానే బయటికొచ్చేశాను. ఆ ఎండలో పరుగెత్తుకుంటూ వాళ్లింటి కెళ్లి 'శ్రీరాములుగారున్నారా?' అని అడిగితే 'లేరు-ఉదయమే వారు బయటికెక్కడకో వెళ్ళే'రన్నది వారి భార్య. ఈ మాట చెవునేసుకొని అదేపరుగున యింటికి వచ్చి ఆతురతతో ఎదురుచూస్తున్న కోటయ్యగారితో 'వారింట్లో లేరండీ' అని రెండుముక్కల్లో చెప్పేశాను.

'అయ్యో నా తెలివా - సుబ్బారావుగారింట్లో ఉన్నారేమో చూచి రాకపోయావూ' అన్నారాయన నా సమాధానానికి ఎవగించుకొంటున్నట్టుగా. నిజంగా నేను సుబ్బారావుగారింటికి వెళ్లి చూచి రాలేదు, మళ్లా నన్నక్కడికి తరుముతారేమో నన్న దిగులుతో

'వారింట్లోనూ లేరండీ' అనేశాను బాధ్యత తీరిపోతుందని.

'అక్కడా లేకుంటే సత్రం దగ్గరే ఉండి ఉంటాడు. చూడూ- నేను రాత్రే చెప్పిఉంచానులే - **అయినా మంచిది మరోమారు జ్ఞాపకంచేస్తే.**

రేపుఉదయమే పెండ్లికొడుకుగారి మేనత్త బంధు వొకరు. వారితోబాటు నలుగురు - కొండ కెడతారుట - మొత్తం ఐదు ఫస్టు క్లాసుబస్సుటిక్కెట్టు రాసిఉంచమని చెప్పి రావాలి. పో - త్వరగా రా భోజనాలవేళవుతోంది' అన్నారు వెంటనే ఏమీ తడువుకోకుండా.

నా ఒంట్లో శేళ్లూ జెర్రులూ ప్రాకినయి. అయినా చలామట్టుకు సర్దుకొని ఊరుకొన్నా.

'బస్సుటికెట్లు కిప్పు డేం తొందరండీ - కాస్త చల్లబడ్డాక సాయంత్రం వెళ్లి చెపితే చాలదుటండీ.' అన్నాను నెత్తి గోక్కొంటూను - ఊరుకుంటారేమో నని - కాని ఊహుఁ.

'ఎలాగు ! బాబూ - ముందుగా బుక్ చేయొద్దూ? చూడు మరి యీమాత్రంపనైనా మీరు చేసిపెట్టద్దూ?' అన్నారు. ఆయనతో నేనేమీ మరి మాటాడలేదు. సరేనని సత్రానికి నడక సాగించాను. నాకు సైకిలు రాదుమరి, నడుస్తూనే ఏదో ఆలోచిస్తున్నాను - 'ఈమాత్రం పనైనా మీరు చేసిపెట్టద్దూ?' - ఎందుకు చెయ్యనూ? అసలు మీరు నాచేత సొంతంగా చేయించుకొన్న పనేమిటి? ప్రొద్దున్నించీ చూస్తూనే ఉన్నాగా - ఏపనితో దినం మొదలెట్టానో, ఇప్పుడేం పని చేస్తున్నానో. అవును. 'నాచేత ఏపని సొంతంగా చెయ్యనిచ్చారు మీరందరూ కలిసి? పైగా యీ మాట అంటారా - ఏదో ఆలోచించుకొంటూ నెమ్మదిగా నడక సాగిస్తున్నా. త్వరగా వస్తే వళ్లా ఏదైనా పని తగులుతుందేమో చూడాలని. ఆశపడ్డ ముహుర్తవేళ ఎలాగో దాటిపోయింది. గతి మందంగానే ఉన్నా సత్రంమాత్రం త్వరలోనే వచ్చింది. అక్కడ పరామర్శిస్తే శ్రీరాములుగా రక్కడ కూడా లేరని తెలిసింది. చుట్టుపక్కల తెలిసినవాళ్లందరినీ అడిగాను శ్రీరాములుగారి ఉనికిగురించి. ఎక్కడా లేరు. సరే. వెనక్కి తిరిగి బయలుదేరాను. కోటయ్యగారు నాకోస మెదురుచూస్తుంటా రనుకొని సందుమలుపుదగ్గఱనుంచీ రొజుకొంటూ యింటికొచ్చాను. వాకిట్లో ఎవరూ లేరు. ఎదురుచూస్తూ సావిట్లో ఉన్నా రందరూ వళ్లి.

'కోటయ్యగారూ - శ్రీరాములుగారు సత్రంలోనూ లేరండీ-' అన్నాను.

'ఇదుగో - ప్రొద్దుటినుండీ వారి సావిట్లోనే కూర్చునిఉన్నారుట. ఆ సంగతి తెలీక పాపం నిన్ను తరిమే నీ యెండలో.' అని అనునయించబోయారు కోటయ్యగారు.

'నాకోసరమా పోయేసిపస్తివి యీ ఎండలో' అని అడిగారు శ్రీరాములుగారు చెయ్యిలాగి క్రింద కూర్చోబెడుతూ.

'చంపేరు బాబూ మీ రిశాళ—' అన్నాను.

అక్కడకూర్చుంటే ఎలాగ? వెంకటేశ్వరరావుగారికి వెండిగిన్నె ఎవరిచ్చారో - నాకక్కడ టిఫి నుందో లేదో - ముని పాపం టిఫిన్ పుచ్చుకొన్నాడో లేదో - బావగారి బట్టలసంగ తేమైందో - శ్యామన్నకి ఉద్దిపప్పు యిప్పించారో లేదో... తెలుసుకోవద్దూ ?

'ఇప్పుడే వస్తానండీ' అని శ్రీరాములుగారితో చెప్పి లేచాను. వరండాలోకి వచ్చేసరికి కృష్ణయ్యగారు నా జబ్బట్టుకొని.

'మీరందరూకూడా యిలా తిరుగుతే ఎలాగా నండూ? పంక్తితర్వాత పంక్తి కూలేలేవాలిగానీ...' అంటూ ఓ విస్తరిముంగు కూలేసారు. పెండ్లిభోజనం. ఏం సాక్కుతుంది. కందిపచ్చడి గొడ్డుచారు రుచి వస్తుందా? తిని లేచి తాంబూలా లిచ్చి-ఓ కునుకు తీసి మళ్లా పెళ్లింటి కెళ్ళాను.

సావిట్లో ముని ఎదురుపడి 'ఏంపని చేశావయ్యా' మీ బావగా రిప్పుడు అలిగికూర్చున్నారు.' అన్నాడు.

'ఏమి? నేనేం చేశాను బావగారి అలకకి'

'నువ్వేమో ఆ గుడ్డలమూట నాగదిలో పెట్టి-స్నానాలగదిలో వారెవరికో బట్టలు పంపమన్నావు - ఇవేకాబోలు ననుకొని వాటిని పంపించాను. అందులో ఏమున్నాయో కూడా నేను చూడలేదు. ఇప్పుడు తెలిసింది.' అన్నాడు గుటకమ్రింగుతూ.

'అరి నీతెలివి మండిపోను-బలే తంటా తెచ్చావే. ఆడవాళ్ల జాకెట్టు-చీరెలూ నోయ్ అవి! వాటిని పెళ్లికొడుకుగారికి పంపేవన్నమాట!!

'ఎంత పరిహాసమైనా స్నానం చెయ్యమని చెప్పి-చీరెలూ రవికెలూ పంపుతారా? అని ఆయనగారికి కోపం వచ్చింది. అదీకాకుండా ఒళ్లు రుద్దుకొనేందుకు సబ్బా అదీ అక్కడెక్కడా లేదుట. బయటకొచ్చేసి - ఒళ్లంతా కళ్లంతా ఎఱ్ఱచేసుకొని బుడబుడా ఆ యెండలో బజారుకెళ్లి సబ్బొకటి కొనితెచ్చుకొన్నారు."

'ఓరి నీతస్సా చెక్క - చాలాగ్రంథం నడిచిందే-'

'మరి నవ్వ స్పష్టంగా చెప్పేవు కావు'

'నాకుమాత్రం ఏం తెలుసూ అక్కడ సబ్బా అదీ లేదని - ఏదో - పెండ్లిపూట హడావుడి ! మరి ఆ గుడ్డల సంగతేమైంది?

'ఏమైందీ? మీ మేనత్తగారూ వాళ్లూ వచ్చినువ్వు పనిచేసిపెట్టావుకావని కోపగించుకొన్నారు - ఎవరిగుడ్డలు వాళ్లు తీసుకెళ్లిపోయారు ?'

ఈ మాటలసందడిలో మిన్నప్పప్పమాట మఱచిపోయా నడగటానికి. సాయంత్రం అయిపోయింది. ఆరాత్రి డిన్నర్ - అందఱము కూర్చున్నాము - మా బావగారికి కూడా కొంతఅలక తీరిం దప్పటికి! డిన్నర్ జరుగుతూండగా మధ్య ఎవరో పెద్దమనిషి అక్కడివారిని హెచ్చరిస్తూ - 'ఏమండీ, మెనూకార్డులో వడలూ - అప్పడలూ వెటంసు ఉన్నాయి. మరి అవేవీ విస్తట్లో పడలేదే!' అన్నారు-

నా నాలిక కొరుక్కొన్నా. ముని పక్కన లేడు మినప్పప్పు సంగ తేమైందో అడగటానికి. ఈలోగా ఎవరో శ్యామన్నని అసిగా రవేవని !

'తెల్లవారుతోనే అయ్యగారితో చెప్తిని సార్ - వారు ఉద్దిపప్పు అంపియ్యనేలేదు. ఏంపెట్టి చేసేది సార్ ? అన్నాడు వేలు పెట్టి అందఱిలోనూ నన్ను చూపుతూ. తప్పింది కాదు - కథ మేనత్తగారిచ్చిన రవికగుడ్డలదగ్గఱనుంచీ మెనూకార్డుదాకా సంగతి అంతా పూసగ్రుచ్చినట్లు విన్నవించుకొన్నాను.

'ఏదో-పెండ్లిపూట హడావుడి !' అన్నా రందరూ నవ్వు ఆపుకోలేక - మా బావగారి అలక సంపూర్ణంగా తీరిపోయింది !

---

# గిరాకీ

గిరాకీ అంటే వ్యాపారులకీ అర్థశాస్త్రం చదువుకునే విద్యార్థులికీ అర్థం బాగా తెలుసు. కాని వారి అర్థం వేరు. వీరి అర్థం వేరు. వారి అర్థం పురుషార్థాలలో రెండోది. వీరిఅర్థం సప్లైతో ముడిపెట్టి గుణకారాలు వేసుకూర్చోడానికి పనికొచ్చే ఒక రాయి లేక రప్ప. (ఆల్జీబ్రాలో ***abcd*** లకి అర్థం రాయీ రప్పా అయినట్టు).

రెండో ప్రపంచయుద్ధంతో అమెరికన్ వ్యాపారానికొచ్చిన వికృతరూపం చూసే సరికి ఈ గుణకారాల బుర్రలు ఖాళీ అయిపోయి ఊరుకున్నాయ్. సప్లైని నేలదన్ని గిరాకీ ఆకాశాని కెగిరిపోయింది.

వ్యాపారం చేసుకోదలిచినవారిని స్వేచ్ఛగా చేసుకోనివ్వాలని [దేశానికి కొంపమునిగినప్పుడు తప్ప] మన రాజ్యాంగం శాసించింది. మన రాజ్యాంగమే కాదు. అమెరికామొదలైన దేశాల రాజ్యాంగాలు కూడా ఏనాడో శాసించాయి. దీన్ని వ్యాపారస్వేచ్ఛ అంటాం.

దీనితోపాటు అమెరికాలో మరొక నిబంధనకూడా ఉంది. ఏదేనా ఒక వ్యాపారంలో పెద్దవ్యాపారులంతా ఏకమై చిన్నవ్యాపారుల్ని మింగేసి, ఆ వ్యాపారాన్ని పూర్తిగా అదుపులోకి తీసుకుని, ఆపైన చిత్తం వచ్చినట్లు రెండు చేతులా లాభాలు గుంజుకోటానికి గుత్తలు ఎత్తులూ వెయ్యకూడదని. ఈ నిబంధన కింద అమెరికాలో రబ్బర్ టైర్ కంపెనీలు రహస్యంగా ఏర్పరుచుకున్న కార్టెల్ ని ఛేదించాలని ప్రభుత్వం ప్రయత్నించింది. కాని ఇంతవరకూ ఏమీ, చెయ్యలేకపోయింది. అంటే ఇకెల్లా ఉందంటే మన రాజ్యాంగం మనందరికీ సమాన స్వేచ్ఛ హక్కులు ఇచ్చాయి, కాని ఊళ్లోఅందరు రౌడీకో పోలీసుఆఫీసరుకో ఒదిగి ఉంటారన్నట్టుంది.

గిరాకీని బట్టి సప్లై ఉంటుందన్నారు పందొమ్మిదో శతాబ్దపు అర్థశాస్త్రవేత్తలు. అంటే గిరాకీ ఎక్కువైనకొద్దీ సప్లై ఎక్కువౌతుందట. గిరాకీతోపాటు ధర పెరుగుతుంది. ఈ సిద్ధాంతాల్ని అవగాహన చేసుకుని ఇరవైయో శతాబ్దంలో వర్తక వ్యాపారులు వస్తువుల ఉత్పత్తి, వేలం, కమిషన్ ఏజన్సీల ఆర్థికసంస్థల్తో సంబంధం ఏర్పరుచుకుని క్రమంగా అక్కడ ప్రాబల్యం స్థిరపర్చుకున్నారు.

ఇంక చూడండి. ఒక చేత్తో పరిశ్రమల ఉత్పత్తిని నొక్కిపెట్టి తరుణం వచ్చినప్పుడు కిందికి నొక్కెయ్యడం; రెండో చేత్తో గిరాకీ పురి బిగించి ధరల్ని పొడుగ్గా సాగదీయడం మొదలెట్టారు. ఈ కాండ సాగిపోతోంటే ప్రభుత్వం మూసి చూసినట్టు కళ్లు మూసుకుంటుంది. ప్రజలు ఎంత గోలచేసినా నిద్రపోతున్నట్లు నటిస్తుంది. అడపాదడపా ఏం పరవాలేదని చెప్తూఉంటుంది. వాళ్ల గోల మరీ ఎక్కువౌతే ఇంక ప్రభుత్వంకూడా అట్టే నిద్ర నటించడం లాభంలేదనుకుని కళ్లు తెరుస్తోందని చూచాయగా తెరిసే సరికి, వ్యాపారులు కొంచెం పురి తగ్గించి "మమ్మల్నేం చెయ్యమంటారు? లేంది ఎక్కడనించి తీసుకొచ్చి అమ్మగలం? మరి కొంచెం ఉత్పత్తి చేస్తోంటే ప్రభుత్వమే అడ్డుతగులుతోంది." అని నెపం ప్రభుత్వంమీదికి తోసేస్తారు.

అమెరికాలో ప్రజలు అట్టే గోల చెయ్యకుండా వ్యాపారులు కొన్ని కొత్తఫేషన్ల మెరుగులు తెచ్చి పులుముతారు. కూలీలకి శెడిమోలిచ్చి, నిరుద్యోగులికి పింఛం(డోల్స్) పడేసి ఊరుకోబెడతారు. అయినా ఆ దేశంలో పరిశ్రమలూ వ్యవసాయం బాగా వృద్ధిచెంది, అందరు ఇంత తినగా పారేసుకోడానికూడా కావలసినంత ఆహారం, సంపదా ఉత్పత్తి అవుతున్న తరవాతనే ఈ వ్యాపారులు ఈ జూదంలోకి దిగారు. కాబట్టి వారు, ఎంతగా జూదమాడినా ఎవరికీ కడుపు మాట్టంలేదు. ఉన్నదల్లా భాగ్యంలోనే. తేడా. ఏ వారాని కావారం సంపాదించుకుంటేగాని రోజులు గడవని వాళ్లు లక్షోపలక్షలుంటే కోటీశ్వరులైన వాళ్లు కొన్నివందలమంది ఉన్నారు.

కాని మనదేశంలో ఏదీ వృద్ధికాకుండానే జూదం ఆరంభించినందువల్ల కూలివాడు రోజుకూలీ జూదంలో పోగొట్టుకున్నట్టవుతోంది. జూదం ఎక్కువా పరిశ్రమ తక్కువా అయేసరికి జూదగాడిచేతిలో గిరాకీ పురి మరీ బిగిసిపోయి అటు ఉత్పత్తి చేసేవాడికీ, ఇటు కొని తినేవాడికీ ఉరి పోసుకున్నట్టుంది. వస్తూత్పత్తి మరీ నేలగరిచింది.

ఈ జూదం మానిపిస్తేగాని ఉత్పత్తి కోలుకోదనే ఉద్దేశంతో బొంబాయి ప్రభుత్వం స్టాక్ ఎక్స్ఛేంజ్ షేర్ మార్కెట్ జూదాల్ని [స్పెక్యులేషన్] నిషేధించాలనుకుంది. కాని ఇంతవరకు ఏం జరగలేదు.

ఒక్కక్షణం కొన్ని అసంగతాల్ని అసందర్భాల్నీ మరిచిపోయినట్టయితే ఈ జూదాన్ని మన పంచదారగిరాకీతో పోల్చుకోవచ్చును. పంచదార అన్ని ఊళ్లకీ సవ్యమైన ధరలకి అందుతున్నదల్లా కిందటిసంవత్సరం ఒకసారి బజార్లోనించి మాయమైపోయింది. రైలువేగన్లు సమయానికి రాలేదనే మిషతోనూ మరోమిషతోనూ పంచదారని మిల్లులదగ్గిరో మరెక్కడో దాచేశారు. పాకిస్తాన్ లో మంచిగిరాకీ తగిలిందని తెలిసి మన వ్యాపారులు చాటుగా కొన్నివేలబస్తాల పంచదారని అక్కడికి చేరవేసి కొన్ని లక్షలు అదనంగా లాభం గుంజారని పుకారు. గిరాకీ ఎంతపనైనా చేయిస్తుంది. దాంతో దూది తక్కువై పురి ఎక్కువై నూలుదారం తెగేవరకూ వచ్చింది. వర్తకులు ఉన్న కాస్తపంచదారనీ అటకలమీదా వంటఇళ్లలోనూ, బట్టల పెట్టెల్లోనూ, భోషాణాల్లోనూ దాచేసి బహిరంగంగానే చాటుగా వీశ నాలుగురూపాయిలకూడా అమ్ముకున్నారు. కూచున్నవాళ్లు కూచున్నట్టు [కావలసినవాళ్లు రాత్రి వేళ తమ ఇంటికి వాళ్లే వస్తారు కాబట్టి] ప్రతిచిల్లరవర్తకుడూ వందలూ వేలూ చేసుకున్నాడు. యుద్ధకాలంలో కానీ సరుకు రూపాయిల పిల్లల్ని పెట్టడం, వేపుడుసెనగలమ్మేవాడు మేడగట్టి తాసీల్దార్ల కద్దె కివ్వడం అందరికీ తెలిసిన విషయమే.

ఇప్పుడీ వ్యాపారాన్ని ఏమంటాం? ప్రభుత్వం అడ్డువచ్చి వర్తకుల్ని సరైన దారిలో నడిపిస్తే అది వ్యాపారస్వేచ్ఛకి భంగం అంటారు. అలా చెయ్యకపోతే ప్రజల్ని దోచుకుతినడానికి వారు చెయ్యని అకార్యం ఉండదు. దీన్ని స్వేచ్ఛావ్యాపారం అనడంకంటె కత్తీవ్యాపారం అనడం మేలు. కత్తీచేసి అమ్మలేనివాడు వ్యాపారి కాడు. కత్తీ చేసి ఆ ధరకి లేక ఎక్కువ ధరకి గాని, మెరుగుపూసి రెట్టింపు ధరకిగాని అమ్మగల వ్యాపారిదే ప్రజ్ఞ. అసలు అలా చెయ్యకపోతే వ్యాపారంలో లాభం

(40-వ పేజీ చూడుడు)

కథానిక:

# మద్రాసీ

శ్రీమతి మాలతీచందూర్

మానవ దౌర్బల్యంగామూ స్తేనవొస్తుంది. అయిదేళ్ల క్రితం ప్రాణాలు అరిచేతుల్లో వుంచుకు భార్యాబిడ్డల్ని వెంటబెట్టుకు కట్టుబట్టలతో రంగూన్‌నుంచి బతుకు జీవుడా అని బయటపడ్డాను. ఆ కష్టాల్లో "డబ్బొద్దు పాడూ వద్దు, బతికుంటే చాలు—యింక ధనార్జనా అనేమాటెత్తను"—అని లెంపలేసుకున్నాను. ప్రాణాల్తో వుంటే ఎల్లాగో అల్లా బతకవచ్చు ననుకున్నాను.

అబ్బె-ధనంమీద మమకారం వోపట్టాన పోతుందా! అయిదేళ్లనంతరం పడకష్టాలు మరుపుకొచ్చాయి. మళ్లీ ధనం, దర్జా, దర్పం యిలాంటివి కావాలని నాలోని అహం గోల పెట్టింది. యుద్ధం అయిపోయింది. మనుష్ల్ని కాస్త కదలనిస్తున్నారు. సంపాయించిన మేడలు కూలాయో వున్నాయో చూసుకోమని మనసు వేధిస్తోంది.

సరే, రంగూన్‌కి ప్రయాణం కట్టాను భార్యాబిడ్డల్ని గుంటూరులో వదిలి. యుద్ధం అయిపోయినా కాకిబట్టలవాళ్లు ఎక్కడ పడితే అక్కడ ప్రత్యక్షం అవుతూనే వున్నారు. టికట్లు దొరకడం లేదు. అయిదేళ్లనుంచి ఎక్కడ చూసినా యీ కాకి గుడ్డలే. చచ్చేవాళ్లు చావగా యింతమంది జనం ఎక్కడనుంచి వూరుతున్నారో!

రంగూన్‌కి పాస్‌పోర్ట్ దొరికేవేళకి తల ప్రాణం తోకకి వచ్చింది. అలాంటపుడు వేరే కాబిన్ అంటే దేవేంద్రవైభవం అన్నమాటే! నాది డబుల్ బెర్త్ కాబిన్ నలుగురుండే కాబిన్ కాకపోవడం ఒకవిధంగా అదృష్టమే. సాయంత్రం నాలుగింటికిగాని స్టీమరు బయలుదేరదు. వూళ్లోకి వెళ్లి అవీ యివీ కొనుక్కుని హార్బరు చేరాను. కష్టమ్స్ యిత్యాది లాంఛనాలైనాక కాబిన్‌లోకి అడుగెట్టేవేళకి మూడున్నర అయింది. నాపక్క బెర్తుమీద ఎవరిదోని బెడ్డింగూ వగైరా సామానులు పరిచివున్నాయి. మరో కాకిమనిషి కాబోలు.

అలా కాసేపు ముందుహాల్లోకి వెళ్దామని బయలుదేరాను. జేబులో పేక సద్దుకు డైనింగ్ హాలులో [illegible] టేబుల్ దగ్గిర కూచుని పేకముక్కలు పరుచుకు పేషన్స్ ఆట మొదలెట్టాను. చుట్టూ కాకిమనుషుల గోల, కూలీల అరపులు. ఎడబాటు ఏడుపులు. మనసు పేకమీద లగ్నం అవడంలేదు. ఆలోచిస్తూ కూచున్నాను.

"మీరు, మిస్టర్ చక్రధర్ కదూ" అంటూ కుర్చీవెనక మనిషి చనువుగా నిల్చున్నాడు.

ఎవర్రా బాబూ అంటూ వెనక్కి తిరిగాను. ఖద్దరులుంగీ— బుష్‌కోటూ—లోపల బనీను లేదు. గుండీలు విడిపోయి గుండె పైకి కనబడ్తోంది. నన్ను సమాధానం యివ్వనివ్వకుండానే "మీ పేరు ముందే చూశాను. కాబిన్‌లో మీరూ నేనూ కలిసివుంటాము." అంటూ పక్క కుర్చీలో కూలబడ్డాడు.

నేను తలవంచుకు పేకముక్కల్లో పడ్డాను. అలా పూసుకొచ్చే మనుష్లని చూస్తే నాకు గిట్టదు. ఈమనిషితో నాలుగు రోజులూ కాబిన్‌లో ఎలా గడపడమా అని ఆలోచిస్తున్నాను.

"అరకు రాజుమీద యిస్పేటురాణి వెయ్యండి—అదుగో వచ్చేస్తోంది ఆట..."

నాకు మహాచికాగ్గా వుంది. పేషన్స్ ఆడేటప్పుడు మరోమనిషి పక్క కూచుని పూరికే చెప్తూంటే లాగి లెంపకాయ కొట్టా లనిపిస్తుంది. మారుమాటాడకుండా పేకముక్కల్ని ఏత్తేసి బాక్సులో పెట్టాను.

నాలుగు నిముషాలు మాటలాడి వొదిలించుకుంటే హాయని "ఎక్కడనుంచి?" అన్నాను.

"యిక్కడనుంచే"

"ఏభాగంనుంచి?"

"మద్రాసీని"

ఏడిచినట్టే వుంది. మద్రాస్ ఏమిటి? తెలుగువాడా— తమిళుడా — మళయాళీయా— కన్నడుడా — ఏప్రాంతంవాడో చెప్పక మద్రాసీ నంటా డేమిటి?

జేబులోంచి సిగరెట్టుకేసుతీసి ఆఫర్ చేశాడు. ఇద్దరం సిగరెట్లు ముట్టించాం.

నాకు మహాచికాగ్గా వుంది. "*love at first sight*" అంటారుగాని నాకు "*Hatred at first sight*" [illegible] కుని లెక్కచేసేట్టులేదు. తన ధోరణిప్రకారం తను మాట్లాడుకుపోయేరకం. బాబోయ్ యీమనిషితో నాలుగుగంటలూ — నాలుగు రాత్రిళ్లూ గడపాలా! భాషరాని కాకివాడే నయం యీ మనిషికంటే. ఏమిటో యీమనిషంటే సదభిప్రాయం కలగలేదు.

"ఈ స్టీమర్లో అరడజను సివిలియన్స్ ప్రయాణం చేస్తున్నారు. ఒక భార్యాభర్తలు. ఆయన బ్రిటిష్ కాన్సల్లో పనిచేస్తున్నాడు. మరిద్దరు వర్తకులూ — మీరూ నేనూ మిగిలిన వాళ్లంతా మిలిట్రీవాళ్లే. మనం ఆరుగురం కూచుని హాయిగా లిటరేచర్ ఆడుతూ టైము గడిపెయ్యచ్చు. మనమిద్దరం కాబిన్‌లో కూచుని డిక్ ఆడొచ్చు" అంటూ చెప్పుకుపోతున్నాడు.

నాకు రేబిక్క ఎత్తుకొస్తోంది. స్టీమర్లో ఎవరు ప్రయాణం చేస్తే నాకేం! ఏదో నాడబ్బు దస్కం పోయి వేమొస్తుంటూంటే. ఈమనిషి వదలడేం.

"అదుగో—అటు చూడండి వాళ్లే నే చెప్పిన దంపతులు. ఆవిడ మంచిచదువుకున్నదానికి మల్లే వుంది. యిటే వస్తున్నారు. మీకు పరిచయం చేస్తాను." అంటూ వాళ్లవైపు నవ్వుతూ వెళ్లాడు. ఈమనిషి తన ప్రభావం స్టీమర్లోని ప్రతివాళ్లమీదా విసిరేస్తాడు కాబోలు.

"వీరు మిస్టర్ అండ్ మిసెస్ రావ్"

"ఈయన మిస్టర్ చక్రధర్" అంటూ మాకు పరిచయం చేశాడు.

మిస్టర్ రావు పొట్టిగా లావుగా వున్నాడు. చూపుల్ని పట్టి మనిషి మితభాషిలా కనపడ్డాడు. చిన్న నోరు, పొడుగాటి ముక్కు. అతనిభార్య పచ్చగా సాజాగ్గా వుంది. వేషభాషల్ని బట్టి నాగరికయువతి అని చెప్పొచ్చు. గొప్పఅందగత్తె కాదు. కాని ఆకర్షణగల మొహం. కళ్లు నల్లమబ్బుల్లా వున్నాయి. చూసీ చూడగానే భర్త యీమెకు తగ్గ వుజ్జీ కాదనిపించింది.

నల్గురం మాటల్లో పడ్డాం. భార్యని ఆరేళ్లక్రితం మద్రాసు పంపాడట.

"ఆరేళ్లయింది రంగూన్‌నుంచి కాలు కదిపి. యుద్ధసూచనలు కనపడగానే మా ఆవిడని మద్రాసు పంపాను. మా కజిన్ యింట్లో యిన్నాళ్లనుంచీ వుంది అసలు మళ్లా తిరిగి యిలా కలుసుకుంటా మనుకోలేదు. ఇప్పుడు కూడా అతికష్టంమీద యిరవై రోజుల శెలవు దొరికింది. వచ్చేటప్పుడు ప్లేన్‌లో లిఫ్ట్ దొరికింది. ఇప్పుడింక సముద్రం తప్పలేదు."

"అల్లానా" అన్నాను.

మాపిన్నికొడుకు R. I. A. F. లో చేరాడు. పాపం, ఏడాది తిరక్కుండా చచ్చిపోయాడు. ఒక్కగా నొక్క కొడుకు. మా చిన్నన్న లక్షలు ఆర్జించాడు అవడిపండ్లవ్యాపారంలో. కాని ఎవరుతినను" అన్నాడు మద్రాసీ.

నా కతనిమాటల్లో నమ్మకం కుదరటం లేదు. అంతా కోతలేమో! మాట్లాడటం కోసం యీకథలన్నీ నేమో?

"పోనీ మిమ్మల్ని పెంచుకో లేక పోయారా?" అన్నాను ఏడిపిద్దామని.

"మా-చిన్నాన్నకి నన్ను చూస్తే గిట్టదు. అయినా నావ్యాపారం నా కుందిగా?"

అవును. యీ డబ్బుని చూస్తే ఎవరికి గిడుతుంది?

"మీరేం వ్యాపారం చేస్తూంటారు?" అని ప్రశ్నించాను తిరిగి.

మాతాత రంగూన్‌లో వజ్రాలవ్యాపారం చేస్తూండేవాడు. మానాన్న కలపవర్తకం చేసేవాడు. నేను రాళ్లవర్తకం చేస్తున్నాను" అన్నాడు మద్రాసీ.

"రాళ్లంటే?" అన్నాడు రావు.

"రోడ్డు కాంట్రాక్ట్సు—కంకర కొట్టించడం, మంచి రహదార్లు వేయించడం—అలాంటివి. కాని, నాకు రత్నాలవ్యాపారం అంటే మహాయిష్టం" అన్నాడు మద్రాసీ.

రావుభార్య ఒక్కమాటకూడ మాట్లాడలేదు. దూరాన్న వున్న దేన్నో చూస్తోంది. మనిషి చలాకీగానే కనిపిస్తోంది. కానీ పెదవి మెదపదేం? గడిచినకాలాన్ని గురించి ఆలోచిస్తోందా? లేక భవిష్యత్తునిగురించి కలలు కంటోందా?

స్టీమర్లో యిద్దరు సివిలియన్సువచ్చారు. అంతా పిచ్చిపాటీ మాట్లాడుకున్నాం. కాని అందరిలోనూ మాటకారి మద్రాసీయే.

అది ప్రయాణంలో రెండో రోజు పొద్దుటనుంచీ మా మద్రాసీకి క్షణం తీరిక లేదు. కెప్టెన్ దగ్గిరనుంచి కళాసులుదాకా అందరూ అతని ఫ్రెండ్సే. నేనుమటుకు బతికి బయట పడ్డాను. కాబిన్‌లో కూచుని వెల్సు చదువుతున్నాను. సాయంత్రం అయిదింటికి కాబిన్ బయటకొచ్చి డెక్ మీద కెళ్లాను. మద్రాసీ, రావూ రావుభార్యా, వర్తకులూ, అనగా నేను మినహా మిగిలిన అయిదుగురూ సివిలియన్సూ నవ్వుతూ కబుర్లు చెప్పుకుంటున్నారు.

"రండి. మీగురించే అనుకుంటున్నాము. సంభాషణ మంచిపాకంలో పడింది అంటూ కుర్చీ చూపించాడు మద్రాసీ. "వజ్రాలు పరీక్షించడం అందరికీ రాదు. ఆ వజ్రాలవల్లే కోటికి పడగెత్తిన మా తాత మామూలుమనిషి అయిపోయాడు."

కోతలు మళ్లీ కోతలు మొదలెట్టాడన్నమాట.

రావుభార్య నిశ్శబ్దంగా కూచునివుంది.

(36-వ పేజీ చూడుడు)

# “అసలు సంగతి ఏమిటంటే...”



‘కొబ్బరిచెట్టు ఎందుకెక్కావురా అబ్బాయి’, అంటే, “దూడగడ్డికోసం ఎక్కా” నన్న సమాధానం, బాగా ప్రసిద్ధికెక్కిన సామెత. ఈ భావమే మరోమాటల్లో, మరోతీగలో, నిత్యం ముద్దాయిల వద్దనుంచి వినబడుతోనే ఉంటుంది. ప్రతి ముద్దాయీ, వాది చెప్పినదంతా ‘అబద్ధం, అక్రమం, అన్యాయం’ అంటూ ఉపోద్ఘాతం ఇచ్చి, “అసలు ఏం జరిగిందంటే నండీ.” అంటూ ‘దూడగడ్డి’ సమాధానం చెప్పటం ప్రారంభిస్తాడు. ఇది కోర్టులోనే కావచ్చు లేదా కోర్టుబయట పెద్దమనుష్యుల మధ్య పంచాయితీలలోనే గావచ్చును. లేదా నేటి నాయకుల పత్రికా ప్రకటనలలోనే కావచ్చు. ముఖ్యంగా చిల్లరనేరాల విచారణకోర్టులలోనే, ఈ సమాధానాలు విరివిగా మనకు దొరకుతుంటాయి. ఆ సమాధానాల లోని కవిత్వాదివిశిష్ట భావుకగుణాలముందు ఈ సామెతకూడా చాల చప్పగా పడిపోయేటట్టుంది.

ఒకొక్కక్క జేబుదొంగ, కేవలం ఉపకారానికి పోతూండగా తనకీ అపవాదు, నీలాపనింద చుట్టుకుందన్నట్టు మహా అమాయకంగా, సద్యస్ఫూర్తి కురిపిస్తూ జవాబు చెప్తాడు. మరొకొక్కడు “కేవలం దురదృష్టం నెత్తిన తాండవమాడుతుండటంవల్ల, ఈ మహాసజ్జనుడికి ఇంతఅపకీర్తి వచ్చిందే పాపం” అని అనిపించేటట్టుకూడా చెయ్యగలడు.

ఒకసారి ఒక దొంగను, జేబులు ఖాళీ చేస్తూండగానే జేబులో చెయ్యి ఇంకా అట్టే ఉండగానే పట్టుకొన్నారు. ఒక బెంచిమీద కూర్చున్న పెద్దమనిషి జేబులోనుంచి బెంచివెనుక వంగినిల్చుని ‘చేద్దెబ్బ’ కొట్టేస్తూ పోలీసులకు పట్టుబడ్డాడు ఈ మహాత్ముడు. దొంగతనం కాదని వాదన పెట్టాడు.

“అయితే పోలీసులు అబద్ధమాడుతున్నారంటావా?” అని అడిగాడు మేస్ట్రీటు గారు.

“రామ రామ, అల్లాంటిమాట అంటం లేదండి, నాకు వికారంగా ఉందని చెప్పుకొంటున్నాను” అన్నాడు చోరమహాశయుడు.

“వికారంగా ఉందీ! వికారంగా ఉంటే నీ చేయి పరాయివాడిజేబులో కెందుకెళ్ళిందయ్యా. దానికీ దీనికీ సంబంధ మేమిటి.”

“అది కాదండీ! వికారంగా ఉండి ఒళ్ళు తూలినట్లయేటప్పటికి, ఆసరా కోసమని బెంచిఅంచుమీద చెయ్యి వేశాను.”

“వేస్తే?”

“చెయ్యి జారి వారి జేబులోకి దూసుకుపోయింది.”

“అల్లాగా పాపం! మరి చెయ్యి పైకి తీసేటప్పటికి చేతిలోకి పర్సు ఎల్లావచ్చిందో! వికారం మరీ ఎక్కువయింది గాబోలేం!”

“చిత్తమండి. ఎక్కువే అయిందండి. ఆవికారంలో ఆసరాగా చేతికి పర్సు తగిలిందండి. ఇంతలో నాకు తెలియకుండానే వేళ్ళు కొంకర్లుబోయి బిగుసుకపోయాయండి. పర్సు వదుల్చుకొందామని ఎంత ప్రయత్నించినా వేళ్ళు కొంకర్లు వదల్లేదండి.”

“పాపం నీరసంగాబోలు. సరే ఆర్నెల్లు జైలులో తిండి పెడితే నీరసం వదుల్తుందిలే పో” అంటూ మొగంలో చిరునవ్వుకూడా లేకుండా మేజస్ట్రీటు తర్వాత కేసువిచారణ సాగించాడు. ఈ జవాబులతో అప్పటికే ఆయనకి చెవులు తడకలు గట్టాయి.

ఇంకో ప్రబుద్ధుడు, అర్ధరాత్రివేళ ఒక ఇంటిగోడ దూకుతూంటే పట్టుకొన్నారు. “తను తనయింటికి వస్తూంటేటప్పటికి వీధి తలుపులు వేసి ఉన్నాయనీ, ఇంట్లోవాళ్ళని లేపి నిద్రాభంగం చెయ్యటం ఎందుకని దొడ్డిగోడ దూకుతున్నాననీ, తీరా పోలీసులు చెప్పేదాకా కూడా అది తన యిల్లు కాదని అతనికి తెలియలేదనీ, అచ్చు తన యిల్లే ననుకొన్నాననీ,” ఆ ప్రబుద్ధుడు మేజస్ట్రీటుముందర కథ సాగించాడు. ఆయనగారియిల్లు, గోడదూకుతున్న ఇంటికి, కేవలం రెండు మైళ్ళదూరంలో మాత్రమే ఉంది.

ఇంకో జేబుదొంగ, ఒక ఆడ ఆవిడ చేతిలో పర్సు కొట్టేశాడు. ఆవిడ కేక లేసేలోపలే పదిగజాలు పరుగెత్తగలిగాడు కానీ, జనం వెంటబడ్డారు. అంతటితో పర్సు అక్కడ పారేసి, మరోదోవ లంఘించుకొన్నాడు. పోలీసులు గాలిలో తుపాకులు కాలుస్తూ వెంటబడ్డారు. అతను పార్కులో దూరి, అక్కడి చెరువులో గొంతుకదాకా మునిగి కూర్చున్నాడు. పోలీసులు పట్టుకొని మేజస్ట్రీటుముందర పెట్టారు. “తప్పు ఎరగనివాడివి పరుగెత్తి నీళ్లల్లో ఎందుకు దూకాల్సివచ్చింది” అని అడిగాడు మేజస్ట్రీటు. “పార్కులో కూర్చొని ఉండగా తుపాకి పేలుళ్ళు వినబడ్డాయండి. తుపాకులు పేలినప్పుడల్లా నీళ్ళల్లో దిగికూర్చుంటే చాలా భద్రమని మాతాత చెప్పాడు. అంతకు మించి నేనేమి ఎరగనండి అన్నాడు.”

“అల్లాగా, తుపాకీగుళ్ళకి నీళ్లల్లో దాక్కోటం కన్న భద్రమైన జాగా, తడిలేనిది ఉంది. నిన్నక్కడికి పంపిస్తాలే” అన్నాడు మేజస్ట్రీటు. ఆ స్థలమేదో మేజస్ట్రీట్ కన్న ఆ పాతకేడీకే బాగా తెలుసునేమో, “ఎక్కడా” అని మాత్రం అడగలేదు.

హుగ్ కేవన్నీ అనే దొంగ జవాబే జవాబు. ఆయనగారు అదీ ఇదీ ఏమిటనీ కార్పొరేషన్ వారి రోడ్‌రోలరే ఎత్తుకుపోటం మొదలుపెట్టాడు. దాన్ని డ్రైవు చేస్తూండగానే పోలీసులు పట్టుకొన్నారు.

“రోడ్డురోలరు డ్రైవ్ చేస్తున్నమాట నిజమే గానీండి, అది ఎత్తుకుపోవాలనుకోటం అబద్ధమండి”

“మరి రోడ్డురోలరు ఎందుకు డ్రైవ్ చేస్తున్నావ్!”

“నేను కొత్తగా ఉద్యోగానికి అప్లై చేశానండి అందుచేత ఇంటర్వ్యూకి నీటుగా వెళ్ళాలనుకొన్నాను.”

“ఓహో! రోడ్ రోలరులో వెళ్తే మరింత ఘరానా అనుకొన్నావులాగుంది!”

“ఛా! ఛా! కాదండి! రోడ్‌రోలరు కింద నా పంట్లాము కోటూ ముడత లేకుండా ఇస్త్రీ చేద్దామని రోడ్ రోలరు స్టార్టు చేశానండి.”

(24-వ పేజీ చూడుడు)



ప్రధాని నెహ్రూకు ఇండోనీషియాపదాతిసౌకా విమానశాఖల సంయుక్త సైనికవందనం

# పండిట్ నె
# ఇండోనీ
## పర్యటన చి




పాపాండజ పర్వతంమీద ప్రధాని నెహ్రూ—ఎడమ చేతివైపున పాపాండజ
అగ్నిపర్వతముఖం భుగభుగలు రేగుతున్నది



ప్రధాని నెహ్రూ, కుమార్తె ఇం
సోకర్నో దంపతులూ, వా

## హ్రూ
## ి యా
## త్రాలు



బాండంగ్‌లో జరిగిన బహిరంగసభలో ప్రధాని నెహ్రూ ప్రసంగిస్తున్న దృశ్యం



ంధీ మనుమలూ,
ి అమ్మాయి



పండిత నెహ్రూ జూన్ 9-న జావాలోని సుందరతరప్రదేశమగు పుంజాక్ వీక్షించిన దృశ్యం. ఇందిరాగాంధి, పి. సుబ్బరాయన్, పండితనెహ్రూ, సోకర్నో ప్రభృతులు ఈ ఫోటోలో కానవగుదురు.

చిత్రసమీక్ష :

# ప్రకాశ్ ప్రొడక్షన్సు వారి

# “మొదటి రాత్రి”

మొదటి రాత్రి—ప్రకాశ్ ప్రొడక్షన్సు వారి చిత్రము. దర్శకులు శ్రీ ప్రకాశరావు. శ్రీయుతులు, ప్రకాశరావు, నారాయణరావు, శివరావు రంగస్వామి, శ్రీమతి వరలక్ష్మి, వెంకుమాంబ ముఖ్య పాత్రధారులు.

ఒక ధనికుల ఇంటి ఆడపిల్ల, చదువుకొన్నది. సత్స్వభావము కలది, పై వారి అనుజ్ఞ అక్కర లేనిది. ఇల్లాంటి యువతి—ప్రేమ ప్రకోపం, లోకజ్ఞానాన్ని, ఇవ్వాళ పోగా, పురుషుల స్వభావ స్వరూపాలను అర్థం చేసికోటంలో ఎల్లా అడ్డువచ్చేదీ, తెలివిడి కల్గటంతో కర్తే వైరాగ్యంలో, సర్వపరిత్యాగమొనర్చి, సామాన్యులమధ్య ఆమె ఎల్లా కష్టాలుపడేదీ, నిర్ధనికుడైనా, సత్స్వభావం గల పురుషుని సాన్నిధ్యంలో, ఆమెకు ప్రపంచరీతులు అవగాహనమయి, అతనిమీద ఎల్లా ప్రేమ కలిగేదీ, చివరికి అతనికోసం కొన్ని కష్టాలుపడ్డా, సుఖాంతంగా అతన్ని ఆమె ఎల్లా పెళ్లి చేసుకో గలిగేదీ, ఇదీ టూకీగా ఈకథ.

కథలో, మంచి పటుత్వ మున్న సన్నివేశాలూ, మనస్తత్వాలలో గట్టి కదలికలు తేగల సంఘటనలూ విరివిగా ఉన్నాయి. కథకు ఉపాంగాలుగానే, నాట్యాలూ, హాస్యమూ, ఉద్దేశితమై, కథలో అతికిపోయినట్టుగానే నడిచాయి.

“మొదటిరాత్రి” అనేది, కథానాయిక యౌవనోత్సాహంలో పాల్గొన్న నాటకం పేరు. పేరులో స్ఫురించినంత బజారీ విశృంఖలత్వము, ఆ నాటకంలోగాని, తరువాత యదార్థ జీవితచిత్రణంలోగాని స్ఫురించక పోవటం, చిత్రంలోని గొప్ప సుగుణము. నిజానికి ఇంతకన్నా గంభీరమైన పేరే ఈ చిత్రానికి ప్రదర్శకులు ఎన్నుకోవలసి ఉండేదేమో !

చిత్రంలో ప్రప్రథమంలో కల్పించిన అంతర్నాటకంలో, స్వప్న జగత్తును [illegible] చక్కగా సృష్టించారు [illegible] దేశం, యౌవనప్రవాహంలో, [illegible] ఎంత సత్స్వభావులైనా, ఎల్లా భ్రమలో పడిపోయేదీ, తిరువాత యథార్థ జీవనంలో పాల్గొనవలసివచ్చేటప్పటికి, తన స్వప్న సౌధాలన్నీ నేలకూలిపోయి, జీవితంలోని దారిద్ర్యం, అసహనం, పరస్పరపీడన, వీటన్నిటిమధ్య ఒక్కసారి మునిగి తేలి, ఎంతటి భంగపాటును, ఎంతెంత దుస్సహమైన కష్టాలను ఎదుర్కోవలసి వచ్చేదీ, నిరూపించటానికి చిత్రం ప్రయత్నించింది.

నటుల హావభావప్రకటనాకౌశలమెంత ఉందో అంతా విరివిగా ప్రకటించగలిగినంత అవకాశమూ, సినేరియోలో ఇమిడి ఉన్నది. ముఖం ఏమాత్రం పలికేదైనా, పలికించుకొనేందుకు కావలసినన్ని క్లోజప్పులు ముఖ్యపాత్రధారులకు ఇయ్యబడ్డాయి. సన్నివేశాల గాంభీర్యాన్ని తగినంతగా ప్రకటితం చేయగలిగేందుకు సంభాషణలు నటులకు కావలసినంత ఆసరాయియ్యాలేదేమో చెప్పలేము. సంభాషణలు చాలా, సహజమైన భాషలో అతిసులభమైన తేట మాటల్లో నడిచినా, గంభీరమైన సన్నివేశాల్లోకూడా, తేలికతనమే చూపించుకొన్నాయి గాని, నటుల హావభావవిలాసాలి, పెంపొందింపచేయగలంత ఉత్కృష్టతతోనూ గాంభీర్యంతోనూ నడిచినట్లు లేవు.

జీవితానికి ముందు వెనక బంధాలతో తబ్బిబ్బులు పడక యథాతథంగా జీవించగల గాంభీర్యంతో, జీవితంలోని ఏపరిస్థితి కాపరిస్థితిని తగినంత ధైర్యంతో జంకు లేకుండ ఎదిరించి నిలిచి జీవితాన్ని నిష్కల్మ బుద్ధితో సంతోషంతో సాధించగల వ్యక్తిగా, దాసు



ప్రకాశ్ పిక్చర్స 'మొదటిరాత్రి'లో నాయికగా, జి. వరలక్ష్మి



ఫిల్మిస్తాన్ 'సమాధి'లో నాయికానాయకులు అశోక్‌కుమార్, నళిని జయవంత్.

శీలాన్ని సినేరియో సృష్టించింది. దాసు పాత్రధారి, ఆ పాత్రకు తగినంత నిర్లక్ష్యాన్ని స్ఫుటంగా అందంగానే చూపించారు. ప్రియురాలు ధనార్జనకై నృత్యాదికాలు చేయవలసివచ్చినందుకు, పురుషునిలో అహంకారము దెబ్బతిని, కోపతాపాలు ప్రకటించినప్పుడూ, పొరుగూరిపంపి, కాపురంలో నీళ్లు పోసేందుకు వచ్చిన మామను, తగినగౌరవంతోనే నిర్లక్ష్యంగా చూచినఘట్టంలోనూ, ఇత్యాది సన్నివేశాలలో ఆవ్యక్తిశీలంలోని మగగాయని తనం బాగానే వ్యక్తపరిచారు. కాని ఆ నాయకునికి అంతర్లీనలక్షణమైన సహజగాంభీర్యం, ఇంకాబాగావ్యక్తంకావాలేమో ననిపించింది.

మనోరమగా, కాస్త ప్రకాస్తిచెందిన కథానాయిక 'మంజు' గాకూడా అంత సహజగాంభీర్యంతోనూ కథపొడుగునా నటనలో ప్రకాశించలేదనే అనిపిస్తుంది. కాకుంటే నాట్యాలూ మొదలైనవి పామరరంజకత్వానికి పనికిరావచ్చునుగాని, ఒక ఉత్తమ నాయిక హావభావ విలాసస్వరూపాన్ని తెర మీద ప్రేక్షకులకు అందచేయటంకుదురలేదు.

శివాయ్ పాత్రధారికి, సహజహాస్య ధోరణి తన కున్నంత ప్రతిభతోనూ ప్రకటితం చేసుకొనేందుకు చక్కని అవకాశం కల్గింది. కాని కృతకహాస్యంతో మెప్పించ గల్గినంతగా సహజమైన హాస్యంతో రంజకత్వం కల్పించగలనని ఈ చిత్రంలో నిరూపించుకోటానికి శివాయ్ ప్రయత్నించినట్లు కనబడదు. "చూడామణి" చిత్రంలోని హాస్యపుస్థాయిని ఈ చిత్రంలో శివాయ్ కూడా అందుకొనే అంత ఆస్కారమూ చిత్రంలో ఉంది.

చిత్రంలో ఛాయాగ్రహణము చాలా సున్నితంగా, మంచి పనితనంతో నడిచినట్లు నడిచింది. మనస్తత్వనిరూపణకై శబ్దంద్వారా చేసిన ప్రయోగాలు, సున్నితంగా ఫలించినట్లులేదు.

చిత్రానికి కూర్చుకొన్న సన్నివేశాలూ, కథాసంవిధానమూ, మొదలైనవన్నీ సినేరియో చాలాచక్కగా భావించుకొన్నట్లు రూపించాయి. కాని ఈ బలాన్ని తగినంత గాఢంగా వ్యక్తం చేయటానికి, నటీనటులూ సంభాషణలూ, తగినంతపూర్తిగా తోడ్పడలేదేమో ననిపిస్తుంది. చిత్రం బాగుందికాని ఇంకా చాలా బాగా ఉండిఉండవచ్చునేమో నన్న భ్రమే చిత్రంచూచాక మిగులుతుంది.

# "అసలు సంగతి ఏమిటంటే..."

(19-వ పేజీ తరువాయి)

కోర్టు అంతా కిలకిలమన్నారు. మేజస్ట్రేటుకు "హాస్యం" తెలియదేమో, ఆరు నెల్లు శిక్ష వేశాడు.

* * *

అల్లిబినీ అనే అతను పదిరూపాయల నోటు అచ్చువేస్తున్నాడని పోలీసులకు అనుమానం కల్గింది. అకస్మాత్తుగా దాడి చేశారు. ముద్రణ యంత్రమూ, అచ్చులు, సగం అచ్చైన పదిరూపాయల నోటూ, అన్నిటిమధ్యా అల్లిబినీ దొరికాడు. కానీ ఏమీ తొణకలేదు. బెణకలేదు. అతి ఉత్సాహంగా సర్కిల్ ఇన్‌స్పెక్టరునూ పోలీసులనూ అందరినీ ఆహ్వానించి, అతి మర్యాద చూపించాడు. "తమకు నావల్ల ఏం కావాలి" అంటూ అతిమర్యాద చేశాడు. కేవలం వ్యాపారస్థుని కొట్లోకి పెద్దమనుష్యులు వచ్చినట్టే ఉంది.

"ఇదంతా ఏమిటో సమాధానం చెప్పుకో గలవా! దొంగనోట్లు అచ్చువేయటం కాదని ఋజువు చేసుకోగలవా?" అని అడిగాడు, సర్కిల్ ఇన్స్పెక్టరుగారు.

"దొంగనోట్లా! ఛా, ఛా, అదేమిటి బాబూ అల్లా అన్నారు. బాబూ అంత పని నే చేస్తానా?"

అంటూ ఆశ్చర్యం వెలిబుచ్చాడు అల్లిబినీ.

"పాపం చెయ్యవేం! అయితే ఈ పది రూపాలనోట్ల ప్లేట్లు, ఈ త్రివర్ణచిత్రాలూ, ఈ ప్రింటింగ్ ప్రెస్సు ఇదంతా ఏమిటో" అన్నాడు ఇన్స్పెక్టరు.

అల్లిబినీ, హాయిగా పెద్ద నవ్వు నవ్వాడు, అమాయకుల హాస్యాలు గిలిగింతలు పెట్టినట్లుగా. తెలియనివాళ్లకి తెలియచెప్తున్నట్లుగా చెప్పసాగాడు.

"ఇదా! ఇది అడ్వర్టైజుమెంటుకు సార్! నేనొక క్షౌరం సబ్బు తయారు చేస్తున్నాను లెండి -"

"ప్రభుత్వఖజానాను క్షౌరం చేసేందు కేనా" అన్నాడు ఇన్స్పెక్టరు.

ఇల్లాంటి చౌకబారుహాస్యం రుచించనట్టు అల్లిబినీ అటు వినకుండా చెప్పుకు పోతున్నాడు.

"ఈ పదిరూపాయల నోట్లు ఆ క్షౌరం సబ్బు అడ్వర్టైజుమెంటుకు వాడబోతున్నాను."

ఇన్స్పెక్టరుకొకటి స్ఫురించింది "ఓహో! అమెరికా ప్రభుత్వవ్యాపారం లాగా, కొనేడబ్బుకూడా మదుపు పెట్తేగాని వస్తువులు ఎవరూ కొనరేమో అని భయపడ్తున్నావు" అని అడిగాడు.

"అబ్బే, మీ కరం అవలేదు. ఈ నోట్ల మీద "కౌంటర్ ఫీట్" దొంగనోట్లు అని అచ్చువేయబోతున్నాను. మీరు దొంగనోట్లు పుచ్చుకొంటారా! పుచ్చుకోరు. అల్లాగే 'నకిలీ' క్షౌరపుసబ్బులు కొంటారా? కొనరు. మా క్షౌరపు సబ్బే వాడండి. అని ప్రకటన చేస్తాను ఆ నోట్లమీద.

"ఓహో! అదా సంగతి! ఏమయ్యా పోలీసులూ, ఈ పెద్దమనిషికి వృథాగా ఇంత శ్రమ కల్గించారా; తీసుకుపోయి వీరికి జైలులో సగౌరవాలు చూపించండి. వీరిని అలజడి పెట్టినందుకు తమ ప్రతం వ్రాసియిచ్చి, "కౌంటర్ ఫీటు" అని ముద్రవేసి ఇయ్యండి. పదండి" అన్నాడు అల్లిబినీని అరెస్టు చేస్తూ ఆ సర్కిల్ ఇన్స్పెక్టరు.

* * *

ఒకరాత్రి ఒకదొంగ ఒక షాపుఅద్దాల కిటికీ బద్దలుకొట్టాడు. షాపులో ఉండగానే పట్టుకొన్నారు. "చేతిలో రాయి చెయ్యిజారి కిటికీమీద పడ్డది. కిటికీ పగిలిపోతే అయ్యో! పగిలిందే, అని బాధ చేస్తూ కూర్చున్నాను." అని చెప్పుకొన్నాడు.

ఫౌంటిన్ పెన్ ఎల్లా వ్రాస్తుందో చూస్తూండగానే రెండు చెక్కులు తనకు తెలియకుండానే ఫోర్జరీ అయిపోయాయని వివరించుకొన్నాడు ఒక ఫోర్జరీ దొంగ.

• భార్యతిండిలో విషం కల్పిన ప్రబుద్ధుడు "ఆత్మహత్యకు ప్రయత్నించబోయాను, ఈ లోపల మా ఆవిడ నాకు తెలియకుండా ఆ కంచం తనముందుకు లాక్కుంది. అంతే కాని నే నే పాపం ఎరగను" అని చెప్పుకొన్నాడు.

* * *

అతివేగంగా కారు పోనిచ్చినందుకు పెట్టిన కేసుల్లో ముద్దాయిలు చెప్పుకొన్న జవాబులు చిన్న చిన్న టుమ్రీలుగా ఉంటాయి. పోలీసువాళ్లు దొంగలేమో నసుకొని కారు వేగంగా పోనిచ్చిన ముద్దాయిలనుంచి, "మా ఊళ్లో బైలుదేరి అరగంటైనా కాలేదు. అంత వేగంగా ఎల్లా వస్తానండి" అన్నవాళ్లదాకా ఉన్నారు.

ఒకసారి ఒక ముద్దాయిమీద గంటకు 75 మైళ్ల వేగంగా కారు తోలుతున్నాడని కేసుపెట్టారు.

"రామ రామ 75 మైళ్లే! నేను 50 మైళ్ల వేగంలోనైనా పోవటం లేదే. కాదండి మేజస్ట్రేటుగారు, 40-లేదు సరి కదా, ముప్ఫై మైళ్లకన్నా తక్కువలో-"

"ఆగు! ఆగు! అబ్బాయి, ఈ దెబ్బను కారు వెనక నిల్చున్న వాళ్లను ఢీ కొట్టేట్టుందని" మేజస్ట్రేటు ఆకథ అంతటితో ఆపించాడు.

* * *

తప్పుచేసి కోర్టులో కప్పిపుచ్చటంలో పేరుపొందినవాడు లామ్రీ అనే లండను గజదొంగ. ఒకరోడ్డుమీద కారు ఆపి జనాన్నందరినీ దోచుకొన్నాడు. పోలీసులతన్ని పట్టుకొని డబ్బు పోయినవాళ్లని సాక్ష్యానికి పెట్టారు. అందరూ అతన్ని గుర్తించారు. లామ్రీ ప్లీడరుని పెట్టకుండా, తనకేసు తనే వాదిస్తున్నాడు.

"మీరు నన్ను చీకటిలో గుర్తించారా" అని సాక్ష్యుల నడిగాడు.

దొంగతనం జరిగిననాటి రాత్రి వెన్నెల బాగుందనీ, అతని ముసుగు తొలగిపోయినప్పుడు అతని ముఖం ప్రస్ఫుటంగా చూశామనీ సాక్షులందరూ ఘంటాపథంగా చెప్పసాగారు. లామ్రీ, వెంటనే ఇద్దరు సాక్షుల చేతికి ఆ ఏటి "ఆల్మనక్" [మన పంచాంగం లాగా, ఏ రోజు కా రోజు వాతావరణాది పరిస్థితుల నన్నిటినీ రికార్డు చేసి ఉంచే ప్రభుత్వప్రకటనపుస్తకం] ఇచ్చి, ఆరాత్రి విషయం చదువమన్నాడు.

"రాత్రంతా మబ్బులు, గాలివాన పొగమంచు, కటికచీకటి కన్నుపొడుచుకున్నా కనబడలేదు" అని వ్రాసిఉంది.

"వెన్నెల లేనిదే చీకటిలో నన్నెల్లా గుర్తుపట్టారండీ?" అని లామ్రీ సాక్షుల నడిగాడు.

కోర్టువారు తెల్లబోయి కేసు కొట్టేశారు. తర్వాత కొన్ని ఏళ్లకు గాని అసలు విషయంబయల్పడలేదు. లామ్రీ ఒక ప్రెస్సు వాణ్ణి లొంగదీసుకొని, ఆ రెండు పేజీలు మాత్రం అచ్చువేయించి తనదగ్గర ఆల్మనక్‌లో కలిపి కుట్టించాడు. కాని ఇది తేలేటప్పటికి లామ్రీ సముద్రాలు దాటి ఫరారి అయాడు.

("[illegible]" ఆధారంగా)



# బాలానందం

# మహత్తరమైన గంట

శ్రీమతి వి. యల్. సీతాదేవి

పూర్వం చైనాదేశములో పెకింగు పట్టణములో బెల్‌టవర్‌లో ఒక పెద్దగంట ఉండేది. దీనిని మ్రోగించినపుడు ఒకస్త్రీ తన జోడుకొరకు నిట్టూర్పువిడిచినట్టు శబ్దము వస్తూండేది. ఈగంటను గూర్చి ఒక చిత్రమయిన కథ చెప్తారు.

ఈ చైనాగంట యాంగ్‌లో అనే రాజుకాలములో కుఆన్‌యూ అనే కుమ్మరివానిచే చేయబడింది. ఈ గంటను ఎంతో గొప్పగా చేయించ దలచి యాంగ్‌లోరాజు కుఆన్‌యూను చాలధనమిస్తానని విదేశము నుంచి పిలిపించాడు. కుమ్మరి 'కుఆన్‌యూ' శాస్త్రీయ ప్రకారముగా మూసలో లోహమును కరిగించ మొదలుపెట్టాడు. గంటను పోతపోశాడు. కాని ఆ గంట అతని అపజయభేరిని మ్రోగించింది. గంటంతా కన్నాలుకన్నాలుగా తయారయింది. దానిని చూచుటతోనే రాజునకు కోపము వచ్చి మరియొక గంటను తయారుచేయమన్నాడు. ఈసారి తప్పక ఫలితము దొరకునను ఆశలో 'కుఆన్‌యూ' వెంటనే లోహములను కరిగించుట మొదలుపెట్టెను. ఏలోటు రాకుండ జాగ్రత్తగానే తయారుచేయుచున్నాడు. రాజు తనపరివారముతోసహా గంట ఎంతవరకు తయారయినదీ చూచుటకు వచ్చెను. కాని ఈపర్యాయము ఒకేసారిగా మూస పగిలిపోయినది. 'కుఆన్‌యూ' తానే తప్పు నెరగననియు అపరాధమును మన్నింపమనుచు రాజుకాళ్ళపై పడ్డాడు. రాజు తన ఆగ్రహమును చంపుకుని చివరిప్రయత్నము మూడోపర్యాయముకూడ ప్రయోగింపమని లేదా ఈపర్యాయము కూడ ఫలించనిచో ఉరిశిక్షే శరణ్యమని శలవిచ్చాడు.

'కుఆన్‌యూ' వేగముగ ఇంటికి వెళ్ళెను. తన ఏకైక పుత్రిక 'కోఆయిను' జూచి కౌగలించుకొని ఏడ్చాడు. 'కోఆయి' తన తండ్రితోబాటు ఏడ్చుటకు బదులుగా ధైర్యముతో తనతండ్రివిచారమునకు కారణము అడిగింది. 'కుఅన్‌యూ' జరిగినదంతా చెప్పి మరీ విలపించాడు. 'కోఆయి' అధైర్యపడక తనతండ్రికి మూడవ ప్రయత్నముకూడా నిరాఘాటంగా కొనసాగింపమని ధైర్యము చెప్పింది. వయస్సులో చిన్నదయిన బుద్ధిలో పెద్దదయిన తనకుమార్తె 'కోఆయిన్' జూచి చాల సంతోషించాడు. కోఆయ్ వెంటనే తన యిల్లు వదిలి ఊరిబయటకు ఎవరయిన జోస్యము చెప్పగల మునులు కనుబడతారేమోనని బయలుదేరింది. ఒక చెట్టుక్రింద ఒక ముని తపస్సు



చేసుకుంటున్నాడు. తపస్సును భంగ పరచుటకు ఇష్టములేక 'కోఆయి' అలాగే ప్రార్థిస్తూ నుంచుంది, కాని ముని కళ్లు తెరవలేదు. 'కోఆయ' ఆగంటయొక్క రహస్యము నెలాగు నైన తెలిసికొని తన తండ్రికి సహాయపడవలె నని ఆత్రుత పడుచున్నది. కొంతసేపటికి ఆముని కళ్ళు తెరచాడు. 'కోఆయి, తన చరిత్రనంత వినిపించి తన శ్రేయస్సును కోరమంది ముని ఆలోచన చేసి తగిన సమాధానమును తెలుసుకున్నాడు. కాని ఆమునిహృదయం ఆమెలో నిజమును ప్రకటించుటకు అంగీకరించుటలేదు. ఎంతటి కఠోరమైన కార్యమయినను సరే తప్పక సెలవిమ్మని 'కోఆయి' వేడుకుంది. ముని చాల విచారవదనముతో గంట పోతపోయుటకు తయారుచేసే లోహములో ఒక అందమయిన కన్యయొక్క రక్తబిందువులు మిళితము కావలసియున్నదని సెలవిచ్చాడు.

'కోఆయ్' వెంటనే చాలసంతోషముతో ఇంటికి తిరిగివెళ్లింది. లోకములో 'కోఆయ్' చాల అందకత్తె అని అందరు చెప్పుకుంటున్నారు, గనుక తానే తనతండ్రికి సహాయపడగల నని చాలసంతోషించింది. 'కుఆన్‌యూ' తనమూడవ ప్రయత్నమును చేయవలసిన రోజు వచ్చింది. 'కోఆయ్' తండ్రితో కూడ రాజభవనమునకు వచ్చుటకు అనుజ్ఞ ఇమ్మని కోరింది. ఇష్టము లేకపోయినప్పటికి తప్పనిసరిగ అంగీకరించాడు. 'కోఆయ్' చాల అందమైన దుస్తులను ధరించి ఆడంబరముగ బయలుదేరింది.



బర్మాయాత్ర సందర్భంలో భారత ప్రధానమంత్రి పండిట్ నెహ్రూ సందర్శించిన ప్రసిద్ధ ష్వీడాగన్ స్వర్ణదేవాలయం.

రాజభవనములో ఈసారి 'కుఆనయూ' ఏమవుతాడో నని చూచుటకు వేలకువేలు జనము వచ్చి కూర్చున్నారు. ఈపర్యాయము జనులందరు 'కుఆనయూ'కు మరణమో లేక రాచరికమో తప్ప దంటున్నారు. రాజు 'కోఆయ్'ను చూచినప్పటినుండి చాల ఆశ్చర్య చకితుడైనాడు. ఆమెఅందమునకు ముగ్ధుడయినాడు. మూసలలో కరిగించటము మొదలు పెట్టారు. ఎప్పటి కప్పుడే ఎంతవరకు తయారయినది 'కోఆయ్' కనిపెట్టుచునే యున్నది. కొంతసేపటికి 'కోఆయ్' ఎవరికంట బడకుండ ఒక కత్తి తీసి తన కంఠ

(40-వ పేజీ చూడుడు)

బాలానందం సీరియల్:




మూలం : ట్రెజర్ ఐలండు
రచన : ఆర్. యల్. స్టివెన్సన్

4

అనుకరణ :
"నళినీ మోహన్"

కొయ్యకోటలో నేను అడుగుపెట్టగానే నన్ను అందరూ కోప్పడినా కానీ, ఎంతో సంతోషపడ్డారు. నేను దీవిమీదకు వచ్చినతరవాత జరిగిన సంగతులన్నీ వివరంగా చెప్పాను. ఓడమీద జరిగినవన్నీ డాక్టరు చెప్పేడు.

నేను పడవలో దిగిన చాలా సేపటివరకూ వాళ్లు నేనులేనిసంగతి గమనించలేదు. గమనించేక కంగారుపడ్డారు. నే నేమయిపోయానో చూసివస్తానంటూ డాక్టరు 'జాయసు' అనే ట్రలానీ సేవకుడిని తీసుకుని పడవ ఎక్కి గట్టుకి బయలుదేరేడు. వాళ్లు వెళ్లడాన్ని సిల్వర్ మనుష్యులు చూసేరు. కాని ఏమీ మాట్లాడలేదు. మ్యాపులో కొయ్యకోట గుర్తించబడినవైపుగా డాక్టరు తనపడవను పట్టించాడు. గట్టున దిగి ఇద్దరూ ఒక ఫర్లాంగు దూరం పైకి వెళ్ళేసరికి వారికి ఎదురుగా కొయ్యకోట కనిపించింది.

కొయ్యకోట అంటే మరేమీ లేదు. ఎత్తుగా ఉన్న ఒక దిబ్బ మీద ఒక మంచినీటిబుగ్గ ఒకటి ఉంది. దానిపక్కనే మంచి బలమైన దుంగలతో ఒక యిల్లు కట్టబడిఉంది. ఇల్లు అంటే మరేమీ లేదు. ఉన్న దొక్కటే పెద్ద గది. దానికి గోడలూ, పైన కప్పూ అంతా దుంగలే. గోడలకు నాలుగువైపులా తుపాకులు కాల్చేటందుకు వీలుగా కంతలున్నాయి. బలమైన తలుపులతో ఆగదికి ఒకే ద్వారం ఉంది.

ఆ ఇంటికి చుట్టూ కొంత మేర వరకూ చెట్లు నరికి వేయబడ్డాయి. అదంతా వట్టి ఖాళీ. ఆ ఖాళీబయలు చుట్టూ మంచి బలమైన దుంగలు దగ్గరదగ్గరగా పాతి కోరడి తయారు చేశారు. ఆ కోరడి ఇంచుమించు ఆరు అడుగుల ఎత్తు ఉంది. దానికి ఒక తలుపూ ద్వారబంధమూ అంటూ లేదు. లోపలికి వెళ్ళాలంటే ఆ కొయ్య లెక్కి లోపలికి దూకవలసిందే తప్ప మరోదారి లేదు. ఆ కోరడి వెలుపలకూడ కొంచెందూరంవరకూ చెట్లూ చేమలూ నరికివేసి, బట్టబయలుగా చేశారు. అందుచేత ఆ ఇంటిమీద దాడిచెయ్యడం మాటలు కాదు. లోపల దాగిన వాళ్లు పైనుంచి వచ్చేవాళ్ళను పక్షులని కొట్టినట్లు కొట్టిపారవెయ్యగలరు.

సిల్వర్ చేతిలో ఎక్కువమంది—ఇంచుమించు 19 మందిఅని వాళ్ల లెక్క. దీవిమీద చంపివేయబడిన ఇద్దరి సంగతీ మిగతా వాళ్లకు తెలియదుగా—ఉన్నా ఓడమీద ఉంటే ఆత్మరక్షణ చేసుకోవచ్చు. అక్కడ అన్నిసౌకర్యాలూ ఉన్నాయి కానీ, అక్కడ ఉన్న లోటు అల్లా మంచినీళ్లు లేకపోవడమే. కొయ్యకోటకు సామానంతా జేరవేసుకుంటే ఇక్కడ నీరూ ఉంది. ఎంతమందివచ్చినా రక్షగా ఉంది. ఓడ సిల్వర్ చేతిలో పడ్డా మ్యాపు దగ్గరలేకపోవడంచేత వాడేమీ చెయ్యలేడు. ఓడను తీసుకుని వాడు లేచిపోయినా ఫరవాలేదు, ట్రలానీ మిత్రుడు కొన్నాళ్ళు చూసి, ఓడను తీసుకుని రానేవస్తాడు.

అంగుచేత తమ సామానంతా తెచ్చుకుని ఈ కొయ్యకోటకు చేరుకోవడమే మంచిదని డాక్టరు ఆలోచించాడు. ఓడకు తిరిగివెళ్ళి తన అభిప్రాయాన్ని కెప్టెన్‌కూ, ట్రలానీకీ, మిగిలినవాళ్ళందరకూ, తెలియబరచాడట. అందరూ బాగుందన్నారట.

వెంటనే కెప్టెన్ ఓడమీద ఉన్న సిల్వర్ మనుష్యులని ఆరుగురినీ పిలిచి, వారి కుట్రసంగతి తనకు తెలుసుననీ, తాము ఓడవదిలి, సామానులను తీసుకొని పోతున్నామనీ, ఈ లోపున అల్లరి ప్రారంభిస్తే కాల్చివేస్తాననీ చెప్పేడు. వారు భయపడి తమగదినుంచి బయటికి రాలేదు. వచ్చినా అడ్డగించడానికి ఇద్దర్ని తుపాకులతో కాపలాపెట్టి కెప్టెన్ సర్దుబాట్లు చేయించాడు. మొదటిమారు పడవ నిండా తుపాకులూ, మందుగుండుసామగ్రీ, ఇన్ని తినుబండారాలూ, మందుపెట్టెలూ తీసుకున్నారు. డాక్టరూ, జాయసూ ఆ పడవను మొదటిమారు దిగిన చోటికే పట్టించేరు. అ సామగ్రినంతనూ మోసి, కోరడిలోపల పడవేసేరు..ఆసామానుని సిల్వర్ మనుష్యులు హరించకుండా తుపాకీనిచ్చి జాయసును కాపలాపెట్టి, డాక్టరు ఓడమీదకు తిరిగివెళ్లేడు. మళ్లీ పడవపూటుసరుకును కోరడిలోకి జేరవేశేడు. ఓడలోనుంచి పట్టుకుపోవడానికి వీలయ్యే అవసరవస్తువులనూ, ఆయుధాలనూ చాలవరకు జేరవేశారు. కాని, ఓడమీద ఉన్న ఫిరంగితాలూకు మందుగుండు మాటమాత్రం మరిచిపోయారు. ఆఖరిపర్యాయం పడవనిండా తినుబండారాలను నింపుకొని, అయిదుగురూ అందులోకి ఎక్కేరు. వాళ్లు బయలుదేరేముందు కళాసులలో 'గ్రీ'అనేవాడు ఒకడు మావాళ్లతో వస్తానని బయలుదేరేడు. మిగిలిన వాళ్లు పట్టుకుంటే గింజుకుని వచ్చేశాడు. ఆ కలహంలో ఒక చిన్న కత్తిదెబ్బకూడా తిన్నాడుట.



మా వాళ్ళ పడవ కొంచెం దూరం వెళ్లేక ఓడమీద ఉన్న కళాసులు పరవళ్లు తొక్కడం ప్రారంభించేరు. ఫిరంగి తీసి, మందు కూరడం ప్రారంభించేరు. వెంటనే ట్రలానీ తుపాకీ తీసి, గురి చూసి, కాల్చేడు. ఆ అయిదుగురిలో ఒకడు పడిపోయాడు. కాని, ప్రమాదం తప్పలేదు. ఏమైనా పడవ పూర్తిగా ఉంది. పైగా పాటువేళ. కదులుతే మునిగేటట్లుగా ఉంది.

ఓడమీద వాళ్లు ఫిరంగి కాల్చేరు. గుండు తప్పిపోయినా ఆ అదురుకి పడవ మునిగిపోయింది. కాని, అక్కడ లోతు ఎంతో లేదు. అందరూ నీటిలో ఉరికేరు. వారిలో ముగ్గురి తుపాకులు నీటిలో పడి పనికిరాకుండా అయేయి. ఇద్దరు తమ వాటిని తడపకుండా ఎత్తిపట్టుకున్నారు. మిగిలినసరుకంతా నీటిలో పడి పనికిరాకుండా పోయిందిట.

ఏమయిందో చూసుకోడానికైనా వీలులేకుండా అప్పుడే ఒడ్డు వెంబడి సిల్వర్ ముఠావాళ్లు పరుగెత్తి వస్తున్నారు. [illegible]

విని వాళ్లు సంగతులు గ్రహించి, గెత్తివస్తున్నారు.

మా వాళ్లు వెంటనే గట్టుకి చేరి, కొయ్యకోటవైపు పరుగెత్తేరు. కాని కోరడిలో ప్రవేశించకపూర్వమే సిల్వర్ గుంపు మీదకు వచ్చేశారు. వాళ్ళవద్ద రివాల్వర్లే తప్ప తుపాకులు లేకపోవడంచేత వీలుచిక్కింది కాని, లేకపోతేనా వాళ్లెంతపనేనా చెయ్యగలిగిఉండేవారు.

సిల్వర్ గుంపు సమీపించగానే కొయ్యకోటలోనుంచీ, బయటినుంచీ కూడా మావాళ్లు తుపాకులు కాల్చేరు. దొంగలలో ఒకడు చచ్చిపోయాడు. ట్రలానీ సేవకుడు, వాడి దగ్గరకు వెళ్ళి, వంగి పరీక్షిస్తుంటే ఒకదొంగ చెట్టుచాటునుంచి కాల్చి పారిపోయాడు. ఆ సేవకుడు గాయపడి, కొద్ది సేపటికే చచ్చిపోయాడు. మిగతావాళ్ళంతా కోరడిలోకి చేరుకున్నారట.

కోటలోకి చేరుతూనే కెప్టెన్ మొట్టమొదటగా తనజేబులోని జెండా తీసి, కోటమీద ఎగురవేశాడు. అది ఎత్తయిన చెట్టుచివర ఉండడంచేత దూరానికి కూడా కనిపిస్తోంది. దానికి గురిపెట్టి ఓడలోని దొంగలు కొంతసేపు ఫిరంగి కాల్చారు. కాని కోట చాటుగా ఉండడంచేత దానికేమీ దెబ్బ తగలలేదు. ఇందాకా ఆ జెండానే నేనూ, గన్ చూసేము.

కొంతసేపున్నాక మునిగిన పడవలోని సామాగ్రిని తీసుకురావడానికి ఇద్దరిని పంపించారు. కాని వాటిన్ని అప్పటికప్పుడే సిల్వర్ తాలూకుమనుష్యులు స్వాధీనం చేసుకున్నారట. పైగా వాళ్లెక్కడినుంచి సంపాదించరో గాని తలోతుపాకీ సంపాదించారట. అది చూసి కెప్టెన్ పంపినవాళ్లు తిరిగి వచ్చారు.

ఇంతలోకి నేను వచ్చాను.

నేనుకూడా వచ్చేక లెక్కవేసుకుంటే మేము ఏడుగురు మనుష్యుల మున్నాం. మాదగ్గిర పదిరోజులకి సరిపడే తిండి ఉంది. దొంగలు పదిహేనుమంది ఉన్నారు.

బెన్‌జమిన్ విషయం అంతా డాక్టరుతో చెప్పాను. డాక్టరు అతని కిమ్మని ఇంత జున్ను పొట్లం కట్టియిచ్చాడు. మరునాడు పట్టుకువెళ్ళి ఇవ్వాలనుకున్నాను, ఆ రాత్రి మాఅందరినీ వంతులువారీగా కఱ్ఱకోటకి నాలుగువైపులా గస్తీ కాయడానికై కెప్టెన్ నియామకం చేశాడు. ఆ రాత్రి ఏదో వేళప్పుడు దొంగలు దాడిచేస్తారని ఆయనభయం. కాని, వాళ్ళు తెగతాగి తందనాలు తొక్కుతున్నారు. అందుచేత మామీద ఏమీ వత్తిడి లేకుండానే ఆరాత్రి గడిచిపోయింది.

తెల్లవారేవేళకి కొయ్యకోటకి అంతదూరంలో సిల్వరూ, మరొకడూ నిలబడి కనబడ్డారు. రెండవవాడిచేతిలో పెద్ద తెల్లగుడ్డ గాలికి రెపరెపలాడుతోంది. అది శాంతి సూచనకాబోలు. కాని, కెప్టెన్ నమ్మలేదు. నన్నూ, డాక్టరునూ, జాయసునూ మూడువైపులా చూస్తూ ఉండమని నియమించేడు. మిగిలిన ముగ్గురినీ లోపల తుపాకులతో సిద్ధంగా ఉంచేడు. అప్పుడుగాని సిల్వర్‌ను కోరడిలోనికి రానియ్యలేదు. అతనికి కాలులేకపోయినా ఆ ఆరడుగులఎత్తుకోరడీ దాటి లోపలికి వచ్చేడు.

వస్తూనే కెప్టెన్ అనుమతితో బయట ఇసుకలోనే చతికిలబడి' చిలుము గొట్టం కూరుకుంటూ తమలో ఒకడుగాయాలమూలంగా రాత్రి పోయాడని చెప్పేడు. ఇంకపద్దానుగురున్నా రనుకుని మేము సంతోషపడ్డాం. వాళ్లల్లో ఎందరికి గాయాలు తగిలేయో మరి.

• సిల్వర్ సావకాశంగా పైపును వెలిగించి, తాను వచ్చిన రాయబారం చెప్పేడు.

“మ్యాపు మాకివ్వండి. నిధిని తవ్వుకుంటాం. ఆ తర్వాత మిమ్మల్ని కావాలంటే ఓడలో ఏదో రేవుకు చేర్చి పంపేస్తాం. కాదంటారూ, తిండీ సరకు లిచ్చి, ఇక్కడే వదిలిపెడతాం. దారిలో ఏదో ఓడ కనబడకపోదు. మీ కోసం పంపుతాం. అదీ కాదు ఇదీ కాదు; మ్యాపు ఇవ్వనే ఇవ్వమంటారా, మరి యుద్ధం తప్పదు.

కెప్టెన్ ఆ రాయబారాన్ని లెక్కచెయ్యలేదు. ఎదురుషరతులు పెట్టి వాళ్లనే లొంగిపొమ్మన్నాడు.

“మ్యాపు ఇవ్వం. యుద్ధం చేద్దామనుకొంటే మీరు పద్దానుగురూ మమ్మల్ని ఏమీ చెయ్యలేరు. పోనీ అంటే ఓడను తీసుకుపోగల శక్తి మీలో ఒకరికీ లేదు. కనుక

లొంగిపోండి. అలా అయితే మిమ్మల్ని ఇంగండు తీసుకుపోయి, సంకెళ్ళతో కోర్టుముందు నిల్చోపెడతాను. తర్వాత వాళ్ళ దయ. మీ అదృష్టం. కాదంటే సరే యుద్ధం ఉండనే ఉంది."

తన స్థితిని అంత స్పష్టంగా గ్రహించగలిగినందుకు సిల్వర్‌కు ఎంతో ఆశ్చర్యం కలిగింది. కోపమూ వచ్చింది. కాని, ఫలితమేముంది? ఇసకలోనుంచి లేవడానికికూడా అతనికి సాయం చెయ్యడానికి ఎవరూ ముందుకు రాలేదు. తిట్టుకుంటూ కోరడిదాకా పాకి వెళ్ళి, ఆ దొంగలసాయంతో నిలబడ్డాడు. తనతోడివాని సహాయంతో ఎల్లాగో దాటి వెళ్ళిపోయాడు.

వెంటనే కెప్టెన్ కొయ్యకోటరక్షణకు గబగబా ఏర్పాట్లు చేశాడు. ఇంటికి ఉత్తరంవైపున కోరడి ఎంతో ఎత్తున లేదు. పైగా ఆవైపున అడవి దట్టంగా ఉంది. ఆ ప్రమాదం ఉంటుందని అది కట్టినవాళ్ళకి కూడా తెలుసునేమో ఆ వైపు గోడకే ఎక్కువ గూళ్లు ఉంచేరు. కెప్టెన్ ఆ వైపున కాపలాకాయడానికి ఇద్దరిని నియమించేడు. ద్వారంవద్ద డాక్టరును పెట్టేడు. మిగిలిన రెండువైపులా చెరొకరినీ ఉంచేడు. గదిమధ్య మందుసామగ్రి పోసుకుని నేనూ, కెప్టెనూ కాల్చినతుపాకులు కూరి అందించడానికి నిలబడ్డాం.

మా ఏర్పాట్లన్నీ పూర్తయిన కొద్దిసేపటికే దొంగలదాడి ప్రారంభమైంది. నాలుగువైపులనుంచీ కాల్పులు కాల్చేరు. మేము ఎదురు కాల్చేము. కాని, వాటి ఫలితమేమీ లేదు. రెండువైపులా ఎవరికీ తగల లేదు. కాని ఒకటి తేలింది ఏవైపున ఎంతెంత బలం ఉందో రెండుపక్షాల వారికీ అర్థమయింది.

తరువాత కొద్దిసేపు ప్రశాంతంగా ఉండి, మళ్ళీ ఒక్కమాటు తుపాకికాల్పులు వినబడ్డాయి. ఆ కాల్పుల మధ్య ఏడుగురు దొంగలు ఉత్తరపువైపున కోరడిదగ్గరకు వస్తూ కనబడ్డారు. వెంటనే ఆవైపున ఉన్న మావాళ్లిద్దరూ కాల్పులు సాగించారు. మొదటిదెబ్బకే ఇద్దరు కింద పడి చచ్చిపోయారు. ఒకడు కోరడి ఎక్కబోతూ కాల్పుల అదురికి వెల్లకిలా పడి వెనక్కి పారిపోయాడు. మళ్లీ తుపాకులను అందుకొనేలోగా నలుగురు కోరడి దాటేశారు. నాలుగువైపులకీ చెదిరిపోయి. ఇంటి గోడలకు దగ్గరగా వచ్చేశారు. వారిలో ఒకడు తూర్పువైపు కంత దగ్గిరికి వచ్చి, అక్కడ ఉన్నవాడి చేతిలోని తుపాకీ లాక్కొని, దానితోనే వాడినెత్తిమీద కొట్టేడు. ఆదెబ్బకు దిమ్మతిరిగి అతడు పడిపోయాడు.

అంతవరకూ వచ్చేక మా పని అయిపోయిందనుకున్నాం. మా తుపాకులు గోడలపక్కనే ఉన్న వాళ్లని ఏమీ చెయ్యలేవు. పైగా ఆగోడలు ఇప్పుడు మాకే నష్టం. వాటిచాటునుంచి మమ్మల్ని సున్నితంగా సరివెయ్యవచ్చు. అప్పుడే ఒకగూడువద్ద దొంగ ఒకడు చేరేడు కూడాను. తుపాకులు కాల్చినపొగ లోపల కమ్మడంవల్లనే వాడివలన ఇంతవరకూ ఆ ప్రమాదం కలగలేదు.

ఈ ప్రమాదాన్ని గ్రహించి కెప్టెన్ "కత్తులు తీసుకుని బయటికి నడవండి" అని కేకపెట్టేడు. నేను వెంటనే నా ఎదట ఉన్న కత్తి తీసుకుని గుమ్మంలోకి పరుగెత్తేను. లోపల చుట్టుకున్న పొగలోంచి బయట పడడంతోటే ప్రాణం హాయి అనిపించింది. వాకిట్లోకి వచ్చేసరికి మొట్టమొదట ఎవడో దొంగని కత్తితో తరుముకుపోతూ డాక్టరు కనిపించాడు. మరుక్షణంలో అతడు ఆ దొంగను నరికివెయ్యడం కనబడింది.

ఇంతలో కెప్టెన్ కేక-"ఇంటివెనక్కాలకు నడవండి". మేమందరం ఇంటితూర్పువైపుకు పరుగెత్తేం. అక్కడ దయ్యమంత మనిషి ఒకడున్నాడు. వాడు నన్ను చూడగానే అరుస్తూ మీదకు వచ్చేడు. నేను పక్కకు తప్పుకోబోయి బోర్లాపడి దొర్లిపోయాను. లేకపోతే వాడి కత్తిదెబ్బకి చచ్చిపోయేవాడినే. క్రింద పడి దొర్లినప్పుడు కోరడివైపు చూశాను. ఒకడు అప్పుడే కోరడి దూకేశాడు. మరోడు కత్తి నోటితో కరిచిపట్టుకుని, కోరడి ఎక్కుతున్నాడు. వాళ్లందరినీ చూసేసరికి నా గుండె గుబగుబలాడింది. మా పని అయిపోయిం

(33 పేజీ చూడుము)



# సంగీతకచేరీధర్మము

శ్రీమతి జె. కమలాదేవి

దేశములన్నిటియందును ప్రసిద్ధులగు సంగీత కళాకోవిదులు కొన్నికొన్ని నియమముల ననుసరించెదరు. వారియందు ముఖ్యముగా రెండు ధర్మనియమములు గలవు. అందు మొదటిది: తాము శ్రమపడి యార్జించిన విద్యయందు విధ్యుక్తధర్మముగ పాటుబడుట యును; రెండవది: వారి విద్యను ఆదరించగల శ్రోతలయొక్క సంఘమును తృప్తిపరచుటకై ప్రయత్నించుటయును. వారు, తాము చేపట్టిన కళలయం దత్యంతసమర్థులైయుండి ఆయావిద్యలయందు (ధ్వజారోహణ మొనర్పగల దిట్టతనము గలవారలుగా నుండవకుదురు) అత్యంతనైపుణ్యమును ప్రదర్శించగలిగి యుండవలయును. దైవదత్తమగు నీకళను న్యూనపరచదగిన లేక, అలక్ష్యము చేయదగిన ఎట్టి పనులనుగాని చేయరాదు. ప్రతికళాప్రదర్శకుడును శ్రోతలకు తన చేతనైనంతవరకు ఆనందోద్రేకములను కలుగజేయుగలిగి యుండవలెను. అతడు ఆయా ప్రదర్శనములను నడిపించువారియొక్క లేక అభిమానులయొక్క యిష్టానుసారము నడచుకొనుచుండును. ఇప్పుడు మనము సంగీతశాస్త్రప్రదర్శకునియొక్క విధ్యుక్తధర్మములను కొంత ప్రయత్నించి తెలిసికొనుట యవసరమగును. అందుకు కొన్ని నియమములు గలవు.

ప్రతి సంగీతపాటకుడును తనయొక్క శక్తిసామర్థ్యములను తనయందలి బలహీనతను, అనగా తన సంగీతప్రదర్శనమునందు తనకు తెలియని విషయములున్నా, తాను సమర్థింపజాలని విషయములనుకూడ బాగుగా మనస్సునందు గుర్తుంచుకొనవలెను. అతని ప్రదర్శనమునందు ప్రేక్షకులు అంతమువరకును శ్రద్ధాయుక్తులై యుండి ప్రశంసించుచు కచేరీయంతమందు సంగీతశాలను విడుచునట్లుగా చేయగలిగియుండవలయును. ఆ ప్రదర్శనమందలి సంగీతము వినెడివారి మనస్సుల [illegible] కొనులాపన) చేయవలెను. ప్రేక్షకులు ఎంతవరకు శ్రద్ధగా కూర్చొని వినగలుగుదురో అంతవరకు మాత్రమే పాడి వెంటనే ముగించదగియుండును. మరియును ప్రేక్షకులు ఇంకను కొంతసేపు కూర్చొని వినవలయునని యెడి కుతూహలము గలుగునట్లుగా నుండవలయును. తన యందలి అశక్తవిషయములను (అనగా అసమర్థములగు విషయములు) ప్రేక్షకులకు తెలియనట్టి యవకాశము నీయరాదు. మనోధర్మసంగీతజ్ఞానమందు గాని; లయ యందు గాని; లోపము లున్నటుల ప్రేక్షకులు తెలుసుకొనునట్టి యవకాశమును కలుగనీయరాదు. సంగీతకళాప్రదర్శకుని యొక్క ఆశయ మెప్పుడును కొద్దికష్టముతో గరిష్ఠప్రామాణ్యసంగీతమును గలుగజేయవలయును. కొద్దిపాటి శక్తిచే ప్రేక్షకుల కానందము కలుగజేయునటుల గరిష్ఠప్రామాణ్యసంగీతమును వినిపింపగలుగునటులుగ నుండవలయును. తాను కచేరీయంతమందు అలసిపోయినట్లుగాని, నిరుత్సాహపడినట్లుగాని, ఎంతమాత్రమును కనుపడరాదు. జనసమూహము తనచుట్టును జేరి తనను ప్రశంసించుచుండు సమయమున ముఖమునందు కొద్ది చిరునవ్వుతో నుండి వారి ప్రశంసల నందవలెను. పాడుటగాని లేక వాద్యమును వాయించుటగాని తాను కష్టపడినటులగాక సాధారణశక్తితోడనే సునాయాసముగా నొనరించినటుల కనుపడవలయును.

దేహశక్తిసంబంధమగు లోపములను ఎంతమాత్రము వెల్లడి కానీయరాదు. అట్లని తేలికభావములతో తేలికగా ముగించుట యనుకొనరాదు తాను ఎప్పుడును హసన్ముఖుడుగా నుండి ఉత్సాహపూరితుడుగా కనుపడవలయునుగాని తీవ్రదృష్టులతో ఎప్పుడును చూడరాదు. ఎల్లప్పుడును తన [illegible] యందు నిమగ్నుడైయుండి బహుశ్రద్ధాయుక్తముగా పాడవలయును. అతడు పాటలో బహుశ్రద్ధను చూపించుచు నిదానముగా ప్రదర్శనము నొనర్పవలయునుగాని ప్రోగ్రామును మూచుకొనుచూ తొందరపాటుగా నుండరాదు. తన శక్తినంతటినికూడ నుపయోగించి శ్రోతలను ఆనందపరచుటకై ప్రయత్నింపవలయును.

సమర్థుడగు ప్రదర్శకుడెప్పుడును తాను కచేరీయందు పాడదలచిన (ప్రదర్శింపగల) చిన్నవిషయముల నన్నింటిని ముందుగనే క్రమము అమర్చియుంచుకొనిన పథకము ప్రకారముగ (అనగా ప్రోగ్రామును ముందుగనే సిద్ధపరచుకొని) నడచును. తన శక్తి నుపయోగించి పాడుటచే వినువారికి సంగీతమందలి యభిరుచిని వృద్ధిపరచుచుండును. అతడి మొట్టమొదటి విధి యేమనగా అచ్చట సంగీతవాతావరణమును అనగా బాగుగా సంగీతాభిరుచిని కలుగజేసి శ్రోతల మనస్సును తననైపునకు ఆకర్షించుకొనుటకు ప్రయత్నింపవలెను. లేనిచో తానెంత శ్రమించి పాడినను ప్రయోజనము లేక ప్రేక్షకులగువారు వినకుండనే అశ్రద్ధతో లేచిపోవుదురు. ముందు చెప్పినరీతిగా శ్రోతలకు అత్యంతమగు సంగీతాభిరుచిని కలుగజేసిన యనంతరము ఇంకను ఎక్కువ శ్రద్ధను వహించి మంచి గాత్రముతో చక్కగా ప్రదర్శించుట యుక్తము. అటుతరువాతను శ్రోతలలో నాకళయందు ప్రవేశము కలిగి శ్రద్ధగా నుండి తెలిసి యానందించువారెవరైనది యున్నా? ఆ విద్యకు ఎట్టి సంబంధమును లేక దూరులై దానియందు అభిరుచి యెంతమాత్రమును లేనివారెవరెవరదియును, సూక్ష్మబుద్ధితో గమనింపవలయును. ప్రశంసాపాత్రత కలిగినట్టి శ్రోతలు గాయకునివలన ననేక అమూల్యములగు విషయములను తాము శ్రద్ధగా వినుచుండుటవలన [illegible]గలుగుచున్నారు. వారల యభిరుచులను బట్టియే ఆ గానకచేరీ యొక్క [illegible]

నిర్ణయింపబడగలరు. అందువలన అట్టివారల యొక్క అభిరుచులను గమనించి ప్రశంసార్హమైన యంశములనే ప్రదర్శించి జయమును పొందవలెను. కచేరీయందు అంతకుముందు తాను నిర్దుష్టముగను (శ్రుతిసహితముగ) అనర్గళముగను, అనేకములగు అందములను జూపింపగలిగినట్టి యంశములనే ప్రదర్శింపవలెను. కాని తనకు రాని; (లేక) అపరిగణీయములగు వాటికై ఎంతమాత్రమును ఊహించి ప్రదర్శింప తలపెట్టరాదు. అదియును గాక తన గాత్రధర్మమునకు సునాయాసముగా పలుకజాలని హెచ్చుస్థాయిస్వరములందు ప్రస్తారములకై ప్రయత్నింపరాదు. ఈవిషయము పాడెడివారికిని, వినెడివారికినీ ఉభయులకును కూడ మంచినే చేకూర్చగలిగినట్టిదిగ నుండును. తనకు తెలియనట్టి రచనలను గాని, మరి యే ఇతరములైననూ, తనవల్ల సమర్థనీయము కానట్టి విషయములను పాడమని యడిగినచో నతి చతురతతో కొద్దిగా ప్రయత్నించి ఎట్లో తప్పించుకొనవలెను. అనగా తనకు క్రొత్తలగునట్టివియు, అలవాటు (అనగా నభ్యాసము లేనట్టి) లేని రాగములను ఆలాపనచేయుటగాని, లేక తాను నిర్దుష్టముగ కల్పనాస్వరములను సృష్టించుటకు గాను తనకు తెలియని గ్రహస్వరములలో నెత్తుకొనుటగాని ఇటువంటి క్లిష్టవిషయములను తెలివితో నధిగమించవలెను. ఎచ్చటెచ్చట అవసరములో అట్టిచోట్లనెల్ల కల్పనాస్వరములను కొద్దినిరవల్‌తో (జాగాచేసి) ప్రస్తరించవలయును. సామాన్యముగా కచేరీయందు రాగమునకొక్కొక్క రచనమాత్రమే పాడదగును. మరియొకముఖ్యవిషయమేమనగా తాను ఆనాటి ప్రోగ్రామునందు ఏరాగమును ఆలాపనచేయనున్నాడో (అనగా రాగ తాన పల్లవులకై) ఆ ముఖ్యమైన రాగమునందలి యొక్క వర్ణములో కచేరీని ప్రారంభించుట చాల సమంజసమును, యుక్తమును. మరియును తాను వరుసగా పాడిన రాగములు తిరిగి రాగమాలికయందు పాడుటయును, తరువాత అంతమునందు కొద్దికొద్దిరచనలను పాడి కచేరీ ముగించవలెను. ఇంకను కృతులకు ముందు ఆయా రాగములయందు చేయు రాగఆలాపనములు అతిదీర్ఘములై యుండరాదు. అవి అందముగను, రంజకముగను; విశేషయుక్తముగను ఉండి 5 నిముషములకంటె నొక్క రాగమును ఎక్కువగా ఆలాపన చేయుతగదు. తనయొక్క రాగాలాపనాశక్తి నంతటినీ ముందు పాడవలసియున్న ముఖ్యరాగముయొక్క ఆలాపనకు వినియోగించుకొనవలెను. ప్రతికృతికూడా నిర్బంధముగా ముందుగా రాగము ఆలాపన చేసి చేతీరవలెననెడి నియమము లేదు. అచ్చటచ్చట కొన్ని రాగములను అందములగు విషయములను రంజకముగా ఆలాపనను చేయుతగినట్టి రాగములలోమాత్రమే ఆ యా కృతులకు ముందు కొద్దిగా నాలాపనను జేసి కృతి నెత్తుకొనవలయును. ముందుగా అచ్చువేయబడిన ప్రోగ్రాములు శ్రోతలకు పంచిపెట్టనిచో వారు రాగ, తాళ వివరములను తెలుసుకొనజాలక కొంత క్లిష్ట పరిస్థితి శ్రోతలలో నేర్పడగలదు. అందువల్ల వారికి వినుకుడలయును; కష్టతరముగను ఉండగలదు. కనుక ముద్రింపబడిన ప్రోగ్రాము పంచియిచ్చుట యుక్తముగా నుండును. ప్రతికృతికినికూడా కల్పనాస్వరములు విధిగా పాడవలసిన అగత్యము లేదు. కొన్నికొన్ని కృతులలో మాత్రము రంజకములగునట్టిచోట్లుగలవు. అట్టిచోట్ల విధిగా తన నైపుణ్యమునంతయును ప్రదర్శించి, కల్పనాస్వరములను పాడవలెను. ఒకేకృతియందు రెండుపర్యాయములుగా రెండుచోట్ల కల్పనాస్వరములను వేయకూడదు. (కొందరట్లు చేయుదురు గనుక అట్టిదానిని వారు మానుట యుక్తము). అపరూపములగు రాగములకు కల్పనాస్వరములను రచించుటయును కృతులయందు చిత్రమగు "ఎడుప్పు" లను (గ్రహస్వరములను) చూపుటయును, ఈ రెండువిషయములున్నూ కచేరియందు మంచిజీవమును కల్పించును. అవియే గాయకునియొక్క శక్తిసామర్థ్యములను ప్రచురింపజేయగలిగియుండును. విధిగా చౌకకాల కృతులయందును దీర్ఘములను రచనలగాంద్లు, నిరవల్ చేయుటయు, కల్పనాస్వరముల రచించుటయును మానవలెను. కల్పనాస్వరములు చౌకకాలమందుకంటెను మధ్యమకాలమందైనచో చాల మనోహరముగా నుండును. ఈ మధ్యకాలకల్పనాస్వరములకు ముందు ప్రారంభముగా (ప్రాతిపదికగా) ఒకటి; రెండు ఆవర్తములు చౌకకాలములో పాడవలయును. గతిభేదములను కలిగినట్టి కల్పనాస్వరములను కచేరియందు ఒక్కసారి మాత్రమే ప్రదర్శించవలయును. అదియును ముఖ్యముగా పల్లవిసందర్భముననే పాడవలెను. నియమితమైన (పాడదలచిన, లేక ఇవ్వబడిన) "పల్లవి" అతిక్లిష్టమైన లేక విషమమైన తాళగతిని కలిగినది అయినచో అట్టిదానియందు గతిభేదములను జూపుటకు ప్రయత్నించునెడల చాల కష్టసాధ్యమగును. అట్టి సందర్భములలో అత్యవసరమగుచో ఈ గతిభేదములకు కల్పనాస్వరరచనను అనుకూలమగు మరియొక ఆదితాళమందలి కీర్తనలో కచేరిలో పల్లవిని పాడుటకు ముందుగనే చేయదగును. గానకచేరీయందు పాడుటకు తెలుగు; సంస్కృతము; తమిళ; కన్నడ; ములయందలి పూర్వవాగ్గేయకారకులు రచించినట్టివానిలో ముఖ్యములైనవిగా నుండవలయును. అట్టి కృతులనే పాడినచో ఆనందము కలుగగలదు. పాడుటకు ఏర్పరుచుకొనిన కృతులు వివిధశైలి, రీతులను, తెలుపునట్టివిగా నుండదగును. ఒక ప్రోగ్రామునందు వేరువేరు తాళములయందు ప్రదర్శించబడునట్టి కీర్తనలుగా నుండవలెను. ఆదితాళమందలి కీర్తనలన్నిటినీ కచేరియొక్క మొదటి సగభాగమందు పాడినట్లయిన అది యొక విచిత్రపద్ధతిగ నుండగలదు. రాగభేదములను గమనించవలసిన బాధ్యత వాయులీనవాద్యకునిదియును, తాళభేదములను గమనింపవలసిన బాధ్యత మార్దంగికునిదియును అయివుండును. ఏవి ప్రసిద్ధములైనట్టివి అయి అనేకఅలంకారయుక్తములుగ నుండునో వాటినే ముందుగా ఇతరములకంటె ముందు అవకాశమియ్యవలెను. పల్లవిపాడిన యనంతరము, రాగమాలిక; పదము; జావళీ; తిల్లాన; అష్టపది; తరంగము మరియును చిన్నచిన్న రచనలను; జాతీయగీతములను; ఇంకను ఏదయిన ప్రత్యేకవిశిష్టత గల మరియేట్టి యితరపాట యయినను; పాడవలయును. మధ్యమకృతియందు రెండు కీర్తనాదికము లేవయినను ముగింపబోవుముందు పాడినట్లయిన చాలా ఆహ్లాదకరముగా నుండును. గాయకుడు తాను పాడునట్టి అన్నిరచనలయందునుకూడ వాటియొక్క అర్థభావములను బాగుగా తెలిసికొనుండవలెను. అట్లయినచో తాను పాడెడి వచనలయందలి భావములను, అందలి శబ్దములను, సాహిత్యములను, చక్కగా ఉచ్చారణ చేయుచు పాడగలడు. వాటియందలి రసభావములను తన ముఖమునందు చక్కగా ప్రదర్శించగలడు.

కచేరియందలి ముఖ్యగాయకునికి రెండు ముఖ్యవిధులు గలవు. ఒకటి తన యిష్టము ననుసరించి ప్రోగ్రామును (కార్యక్రమమును) నిశ్చయించుకొనుటయును; రెండవది తన ప్రక్క నుండెడి సహకారవాద్యకులయొక్క గౌరవమును కాపాడుటయును, ఈ రెండును

ముఖ్యముగా గమనించదగినవిషయములు. సహకారవాద్యకులను బాగుగా ప్రోత్సాహపరచి వారలను శ్రోతలయొక్క ఆదరాభిమానములకు ప్రశంసనీయులుగా తోచగలుగునట్లు చేయవలయును. అదివారలు ఏవయినను వారి మధ్య నుండెడి పరస్పర భేదభావములను పురస్కరించుకొని అతిక్లిష్టములగువాటిని పాడుటకు ప్రయత్నింపరాదు. పాటకుడు తాను ఏవయిన అపూర్వరాగములను పాడుటకుగాని, లేక క్లిష్టములగు "ఎడుప్పు" లను ప్రదర్శింపదలచినచో గాని ప్రక్కవాద్యకులకు వాటిని తెలుసుకొని చక్కగా అనుసరించుటకు తగిన అవకాశము నీయవలెను. లేనియెడల తాను ముఖ్యగాయకస్థానమునకు అనర్హుడును; నిందార్హుడును కాగలడు. అది ముఖ్యముగా గమనించదగును. మరియును, తాళము చక్కగా చేతితో యుక్తమగు రీతిగా ప్రదర్శించవలయునే కాని తాళాంగములను ప్రదర్శించకను గనీ, చేయి ముడిచి పెట్టిగాని; సగము తెరిచిగాని; మరి యితర విధముగా ననగా మోసగించువిధముగా నెంతమాత్రమును ప్రదర్శింపరాదు. ఏకారణము వల్లనైనా తన సహకారవాద్యకుడగు వాయులీనవాద్యకుడు శ్రోతలయొక్క ప్రశంసలకు పాత్రుడయి శ్లాఘనీయుడైనచో ప్రధానగాయకు డెంతమాత్రమును అసూయ జెందరాదు. తానును ఎక్కువగా అతనియొక్క ప్రావీణ్యమును కొనియాడవలయును. మృదంగవాద్యకునికి, కచేరియందు అధమపక్షము రెండు పర్యాయములైనను తని (సోలో) వాద్యము వాయించుటకు తగిన అవకాశమును ఇవ్వవలయును. ఈ రెండుభాగాలున్నూ; వేరు వేరు తాళములయందు ఇవ్వవలెను. అదియును తగినట్టి కాలగతిలో ఇవ్వవలయును. కచేరీయందు మరియు నింకను, తాళవాద్యములు అనగా ఘటము; గంజీరా; మోర్సింగ్; మొదలైన ఇతరవాద్యములుకూడా ఉండినయెడల వారలకుకూడా కచేరీ ప్రథమభాగమునందు కనీసము ఒక్కొక్కరికి ఒక్కొక్కసారయినను (సోలో) తనివాద్యమును వాయించుట కవకాశ మీయవలెను. పల్లవిముగింపునందు ఈ సహకారవాద్యకులందరునుకూడా మృదంగవిద్వాంసుతో కలసి చక్కగా రంజకముగా తమతమ వాద్యములను ప్రదర్శించవలయును. ఈ సహకారవాద్యకులందరును కలసి ఐక్యముతో ముఖ్యగాయకునికి చక్కగా సహకరించుచు అందరును ఆ కచేరీని జయప్రదముగా నొనర్పవలయును. అతనియందు (ముఖ్యగాయకునియందు) ద్వేషము వహించుటగాని, లేక యతని గౌరవమును క్రిందుపరచుటగాని, ఎంతమాత్రమునూ కూడదు. ముఖ్యగాయకుని యొక్క శక్తిధర్మములను గుర్తించి అందుకనుగుణ్యముగా సహకరించవలయును. వాయులీనవాద్యకుడు ఎల్లప్పుడును ప్రధానగాయకుని అనుసరించి వాద్య మొనర్పవలెను. తగ్గుశృతిలోగాని, తగ్గుకంఠస్వరములోగాని గాయకుడు పాడెడివాడైనచో వాయులీనవాద్యకుడు తన వాద్యసాధనమునకు కొంచెము తక్కువపాటి (లసరి) తంత్రులను అమర్చుకొని చక్కగా శృతిజేసి సహకారముగా కలిసి వాయించవలయును. తెలివిగల్గినవాద్యకు డెప్పుడును ప్రధానగాయకుని మన్ననకు పాత్రుడగును. తిరిగి తానును వారిపట్ల నట్టి గౌరవప్రశంసలనే చేయవలయును.—

కచేరిబృందము:—దక్షిణదేశసంగీతకచేరీయందు ప్రధానగాయకు డొకడును, వీణకచేరీయైనచో వైణికుడును, వయోలిన్ వాద్యకుడును, మృదంగవాద్యకుడును, ముఖ్యముగా నుందురు. వీటికి అనుగుణ్యముగను సహకారముగను శృతి వేయుటకుగాను తంబురిశృతి వేయువా రొకరుండవలెను. (వైణికులకును, గోటవాద్యకులకును ఈ తంబురాశ్రుతి యనవసరము. వారి వాద్యమునందే శృతివేయు నేర్పాటు గలుగుగనుక వేరుశ్రుతి అక్కరలేదు.) వాయులీనకుడును మృదంగవాద్యకుడును ముందువైపున ఎడమకుడివైపులను కూర్చుందురు. తంబుర వేయువాడు వెనుక కూర్చుండును. ఇంకేవైన ఇతరసహకారతాళవాద్యము లుండినచో ప్రధానగాయకునికి కుడివైపున వరుసగా కూర్చుందురు. మృదంగవాద్యకున కెప్పుడును దాని కుడిమూతగలవైపు సభికులవైపున కుండునట్లు అవకాశ మీయవలెను. ఎడమచేతితో వాయించువాడైనచో నిద్దరును మారి అటునిటుగా కూర్చొనవలెను. దక్షిణదేశగానకచేరీలయందు శృతికి తంబుర నుపయోగించుటయే ముఖ్యము.

---

# పాతర్ల దీవి

(30 వ-పేజీ తరువాయి)

దనుకున్నా. కాని, తీరా చూస్తే మేమే నెగ్గడం కనబడింది.

ఎవడో నన్ను నరకబోయాడనీ, వాడిదెబ్బనుంచి తప్పించుకోబోతూ కిందపడిపోయా నని చెప్పేను కదూ? ఆ సమయంలో 'గ్రే' నా వెనుకనే ఉన్నాడు. ఒక్క దెబ్బతో ఆ దొంగని గ్రే నరికివేశాడు. ఇంకొకడిని ఎవరు చంపేరొ నేను చూడలేదు కాని, మొత్తంమీద వాడిని చంపెయ్యడం జరిగింది. ఆవిధంగా మొదట కోరడిలోకి దిగిన నలుగురిలో ముగ్గురు చచ్చిపోవడంతో దొంగలకి గుండెలు జారిపోయాయి. దిగినవాళ్ళూ, దిగబోతూన్నవాళ్ళూ కూడా మమ్మల్ని చంపాలనే మాట మరిచిపోయి, తమ ప్రాణాలను దక్కించుకొనేటందుకు పారిపోయారు.

ఏ క్షణంలోనైనా బయటినుంచి దొంగలు కాల్పులు ప్రారంభించవచ్చును. అందుచేత మరల అందరం లోపలికి చేరుకున్నాం. ఎదురు కాల్పులకి తయారీలు చేసుకోబోయేం. కాని, తీరా చూస్తే నాలుగువైపులా నిలబడ్డానికైనా మనుష్యులు కనిపించలేదు. దెబ్బలాటలలో జాయిసు చచ్చిపోయాడు. ట్రిలానీయొక్క మరొక సేవకుడు "హంటరు" మొట్టమొదటనే ఒక దొంగ కొట్టిన దెబ్బకి రిమ్మతిరిగి పడిపోయాడు. కెప్టెన్‌కు మోపయిన గాయం తగిలింది. ఇంక మిగిలినదల్లా నలుగురం.

కాని మా సంతృప్తి ఒక్కటే మిగిలింది. దొంగలలో ఇద్దరు కోరడివద్ద ముగ్గురు కోరడిలోపల చచ్చిపోయారు. కనీసం ఒకరిద్దరికేనా గాయాలుతగిలిఉంటాయి. గాయాలు తగలలేదనుకున్నా వాళ్లల్లో మిగిలినదల్లా తొమ్మిదిమంది మాత్రమే. ఫరవాలే దనిపించింది.

# రవీంద్రనాథ ఠాగూరు

(12-వ పేజీ తరువాయి)

అప్పుడు మాత్రమే అసాధారణ - అస్తో" రాజ్య - హృదయైకాంత గరిష్ఠశక్తితో పరిచయం కలుగజేసుకుంటాడు - మానవుడు. అదే కాంతిప్రపంచం; ప్రేమజగత్తు అక్కడ ఆనందం మాత్రమే ఉంది. భాష లేదు. అదే అనేకరూపాల్లో ఆత్మప్రకటన గావించుకునే ఆనందధరిత్రి. "ఆనంద రూపాం అమృతం యద్విభాతి."

మానవానుభవకవిత్వం, అలంకారాలకు విభిన్నమయిన జీవితవాస్తవాలు, ఏకాంత సంపాదితాలు. మనం మన ఆత్మను ంచి తొలగిపోయినప్పుడు, మనకు సుగమ్యమయిన ఒకే ఒక సత్యంనుంచి దూరమౌతాం. మానవుడు తానే తన ప్రేమలోనూ, మతంలోనూ ఉంటాడు. ఈరెండూ పూర్తిగా వైయక్తికాలు, ఆంతరంగికాలు, పవిత్రాలు. విలక్షణలక్షితాలు. మనోమందిరం పైన కూడా సమాజం దాడి జరపయత్నిస్తే జీవితం తన యావత్తు మూల్యాన్నీ, స్వచ్ఛతనీ పోగొట్టుకొంటుంది. మానవుడు సంపాదనలో యితరులతో పాలు పొందవచ్చును గాని తన ఆత్మలో మాత్రం కాదు.

మనం యీనాడు మన అధ్యాత్మికధనరాసులను కూడా గుర్తింపలేనంత నిరుపేదలమయ్యాం. మనం జాగృతజీవితసంకుల సమ్మర్దంలో పడి, మనకి వినిపించని విషయాలపైకి మన ధ్యాసని పోనివ్వం. ఆకస్మిక కంపమూ, సంక్షోభకారణమయిన ఉద్రేకమూ, అంతర్దర్శనకాంతిరేఖలూ, యిదే మన మాయాస్వభావాన్ని బయలుపరుస్తాయి; వీటి మూలంగానే మనం వస్తుసత్యాన్ని గ్రహిస్తాం. ప్రశాంత మనస్కుడగు పురుషుడు మాత్రమే జీవితంలో ని ఆధ్యాత్మికభావాన్ని గ్రహింపగలడు. ఆధ్యాత్మికసర్వస్వానికీ నియమం సమ్యగ్వర్తనం. మనం హార్దిక [illegible] ర్మస్థలాలను కాంతిలో భాస్వంతాలు గావించాలి. మన ప్రతిజ్ఞలూ, పన్నుగడలూ మనలను సత్యం మంచి తొలగించే ఆటంకాలు. మనం మా కంటె మననస్తువులకు యెక్కువ సన్నిహితులం. మనం మనకు మనమే యేకాంతంగా-కఠోర యేకాంతంలో-ముఖాముఖి కూర్చోడానికీ భయపడతాం. మందులతోనో, మద్యంతోనో, ఉద్రేకంతోనో, ఊడిగంతోనో మననుంచి సత్యాన్ని మరుగు పరచ యత్నిస్తాం. మనం ప్రయత్నంమీదనే కలిసి ఉండడం నేర్చుకోవాలి; అంతర్జీవనాన్ని అలవరచుకోవాలి; శరీరమనోమేధస్సంబంధ బాహ్యాకపచాలనుంచి విడివడాలి. అప్పుడు మాత్రమే అత్మప్రశాంతికీ అందుబాటులో మనస్సును చూస్తాం. అంతఃపరిశోధనే అధ్యాత్మిక జీవితానికి ప్రప్రథమసోపానం.

మనం చేతస్సులోతుల్లోకి స్పృశింపబడకుండా, బాహ్యజీవితాన్ని గడిపినంతకాలమూ ఆత్మసంబంధరహస్యాలనిగాని, జీవితార్థాన్నిగాని అర్థం చేసుకోలేం: ఉపరితలంపైన జీవితం సాగించేవాళ్లకి సాధారణంగా ఆధ్యాత్మిక జీవితంపైన విశ్వాసం ఉండదు. మతాన్ని అక్షరశః అంగీకరించడంవల్ల వాళ్ళు ఋతగీత్యా తమవిధులను నిర్వర్తించుకొంటున్నట్టు నమ్ముతారు. అటువంటి ఆధ్యాత్మికఅస్వతంత్రత నిజమయిన ధార్మికజీవితంలో అస్థిరత అనిపించుకొంటుంది. ధార్మికజీవితానికి పునాది అచంచలవిశ్వాసం. స్వతంత్రభావనలేని జీవితం ఆధ్యాత్మికజీవికి సుఖాన్ని యివ్వలేదు. మనలో ఆత్మవిశ్వాసం లేకపోవడంవల్లనే యితరులు చెప్పినమతసత్యానికి తలఒగ్గవలసి వస్తుంది. ఒక్కసారి ఒక వ్యక్తి తన ఆత్మస్వాతంత్ర్యంతో సత్యాన్ని వెంబడించి, తనలోనే లక్ష్యనిర్మాణం గావించుకున్నట్టయితే, అతనికి సంభవించే ప్రతి విషయాన్నీ చేపట్టగల స్వత్వమూ, స్థిరత్వమూ అప్పుడే తగినంతగా లభ్యమౌతాయి. ప్రతికూలపరిస్థితులలోకూడా అతను తనశాంతినీ, శక్తినీ నిల్పుకోగలుగుతాడు. పరిపూర్ణ ఆత్మప్రశాంతతే మానవప్రయత్నానికి యేకైకధ్యేయం. సృజనశక్తిపైన గంభీరమైన విశ్వాసంకలిగి, తద్వారా యీ క్షుద్రవాంఛలనుంచి విముక్తుడైన వాడికి మాత్రమే యిది సాధ్యమౌతుంది. ధార్మికంగానీ, కార్మికంగానీ, సాధారణంగా ఛాందసమతం అతని దృష్టిలో యించుమించుగా శూన్యం.

కాని ఆధ్యాత్మికరాజ్యంలో నివసించడమంటే ప్రాపంచికవాస్తవాలకు విముఖంగా ఉండడమని అర్థం కాదు. ఆత్మయే సర్వస్వమనీ, జీవితం మాయాకల్పితభ్రమ అనీ, మానవసమాజానికీ, బాహ్యజీవితానికీ ఉపయుక్తమయ్యే ప్రతి ప్రయత్నమూ మౌర్ఖ్యమనీ, ప్రేరేపింపబడి, మన భారత సాధువులు అనేకపర్యాయాలు ఈభావానికి బలి అయ్యారు. తరచుగా ప్రపంచసర్వస్వాన్నీ తిరస్కరించిన శుష్కజ్ఞాని ఆదర్శం ఆదరింపబడింది. అందువల్ల భారతదేశం దయ్యాలతో నిండిన భూమిపైన సంచరించే మృతజీవుల సాంస్కృతిక రంగమయింది. ప్రాపంచికవిషయాలనుంచి దూరంగా మడికట్టుకు తొలగిపోయినవాడుగాని, దాని దుఃఖాలను గ్రహించనివాడుగాని, ఎవ్వడూ నిజమైన జ్ఞాని కాడు. శూన్యంలో మంచిని అరపరచుకోవడం అసాధ్యం. ఐహికప్రపంచంలో ఆధ్యాత్మికవ్యక్తి ప్రపంచవాస్తవాలవైపు వెన్ను త్రిప్పి కూర్చోడు. అంతకంటె మంచి వస్తువులను, మంచిహార్దికపరిస్థితులను సృష్టించడంకోసం దానితోపాటే పనిచేస్తాడు. ప్రకృతిజీవితంలోనే ఆధ్యాత్మికజీవితం ఉద్భవిస్తుంది. కవికావడం మూలంగా రవీంద్రనాథ్ లౌకిక ప్రపంచాన్ని, అలౌకికప్రపంచానికి ఛాయామార్గంగా గ్రహిస్తాడు. అతని భావప్రవేశంవలన భౌతిక ప్రపంచం పారదర్శకం అవుతుంది.

జగత్తు మాయాజాలం కాని, మిథ్యాభ్రమగాని కాదు. అవి ఆత్మాభివృద్ధికి అవకాశాలు; తత్వగ్రహణకు మార్గాలు, ఉపనిషత్పరివ్రాజకులనుంచీ, గీతాచార్యులనుంచీ పరంపరగా వస్తున్న మహనీయమయిన ఆచార మిది. అవి జీవితాన్ని కాంతివంతంగావిస్తాయి. భగవంతుడే సృష్టిబంధనాలను తన భుజాలపైన భరిస్తుంటే, మనం యీ ప్రాపంచికబంధనాలను యెందుకు గ్రహించకూడదు? మనం యీ కవోష్ణ చర్మాంబరాన్ని వాల్చినందుకు "ఫిర్యాదు" చేయనక్కరలేదు. మానవసంబంధబాంధవ్యాలు ఆధ్యాత్మిక జీవితానికి ప్రాణతంతువు. దేవుడు ఆకాశంలోని "సుల్తాను" కాడు. అతడు అందరిలోనూ, అందరివలన, అందరినీ అధిగమించిఉన్నాడు. మన స్వచ్ఛమయిన ప్రతిపూజావిధానంలోనూ అతనినిపూజిస్తాం; పరిశుద్ధమయిన ప్రేమతో అతనిని అర్చిస్తాం; మంచి మనసులో అతనిని మనం భావిస్తాం; సమ్యజ్జ్ఞానసములో అతనిని మనం గుర్తిస్తాం. ఠాగూరు "మానవునిమతం" పైనయిచ్చిన "హిబ్బర్టు ఉపన్యాసాలు" మన అందరి హృదయాలలోనూ ఉన్న అనంతుని గుర్తింపును ప్రబోధిస్తాయి.

ప్రపంచప్రముఖులు దానిలోని దుఃఖాలనుగుర్తించి ప్రవర్తిస్తారు. బుద్ధుడు మైత్రిని ప్రబోధించడంలోనూ, గీత అందరియందూ స్నేహాన్ని బోధించడంలోనూ – మనం ఒకళ్లనొకళ్ళం ప్రేమద్వారా అర్థంచేసుకోగలమని భావం. జీవితాన్ని దుష్టంగా చూడడం, ప్రపంచాన్ని కేవలం భ్రమగా భావించడం పూర్తిగా కృతఘ్నత. రవీంద్రుడు "సన్యాసి" అనే రూపకంలో ఆగ్రహాకృష్టమైన ప్రకృతి మానవవాంఛలను, వాత్సల్యాన్ని తెగత్రెంపులు చేసికొని, తనను జయించాలని ప్రయత్నంచేసిన సన్యాసిపైన ఏవిధంగా కసితీర్చుకున్నదో మనకు చూపించాడు. అతను ప్రపంచం నుంచి బొత్తిగా వేరుపడి ప్రపంచవాస్తవికజ్ఞానాన్ని తెలుసుకోడానికి ప్రయత్నం చేశాడు. ఒక క్షుద్రబాలిక అతనిని ఆ అయోమయప్రపంచంనుంచి జీవితరంగానికి తీసుకవచ్చింది. ఏసన్యాసమూకూడా సజీవసౌందర్యాన్ని అణచడానికి సమానం కాదు. సన్యాసి ఆంతరంగికమైన ఆటంకాలు సౌందర్యసముదగ్రతముందు మోకరిల్లాయి. సమ్మర జీవితం అతడిని బాహువులు చాచమని ఒత్తిడిచేసింది. అప్పుడు సన్యాసి "అధికతను అల్పవస్తువులలోనూ, అపారతను హద్దులలో ఆత్మీయ శాశ్వతస్వతంత్రతను ప్రేమలోనూ తెలుసుకోవా"లని గ్రహించాడు. మనం స్వర్గాన్ని భూస్థలికి తీసుకురావాలి. శాశ్వతత్వాన్ని గంటలో యిమిడ్చాలి; ఈ ప్రపంచంలోనే భగవంతుడిని రూపొందించాలి. సన్యాసులు పూలకుండీలలో కత్తిరించి ఉంచిన పువ్వులవంటి వాళ్లు. కొంతసేపు వీక్షించడానికి వాళ్లు అందంగానే ఉంటారు కాని భూభాగంనుంచి పోషణ లేకపోవడంమూలంగా వెంటనే వాడిపోతారు. స్థిరంగా, పాదుకుపోయి ఉండడానికి మానవుడు జీవితపోషణకు ఒప్పుకోవాలి. సన్యాసం నరునిపెరుగుదలకు యెంత అవసరమైనా కావచ్చు; కాని మానవాభివృద్ధికి సాహాయ్యకమగుపోషణను వ్యతిరేకించడానికి పొరబడరాదు. ధనవంతునియింట కూర్చోడానికి యతికి అభ్యంతరపెట్టరు; విలువగల లేపపరిమళాన్ని వారించరు.

దేవుడు మనకష్టాలనీ, కన్నీళ్లనీ – ఆక్రందనాలనీ, అభోజనాలనీచూచి ఆనందిస్తాడనీ; తమకుతామే మొదలంటా పీడింపబడితే ప్రేమిస్తాడనీ ఊహించడం మూర్ఖత్వం. జీవితం మహనీయమయిన బహుమానం. దానిని ప్రేమించలేనివాళ్లు అందుకు తగరు. తమ జీవితాలను నిరర్థకంగా వదిలేసి శాంతి అనేవాళ్లు తమపనియందు ఠాకూరు తోడ్పాటు పొందలేరు.

జీవితాన్ని తిరస్కరించడానికి మత వర్గంలో అడుగుపెట్టవలసిన అవసరంగాని, సన్యాసి కావలసిన అవసరంగాని లేదు. నిషేధాలతోనూ, బహిష్కారాలతోనూ చుట్టుకోబడి మనలో చాలామంది జీవితాన్ని తిరస్కరిస్తాం. హైందవభావనా ప్రధానాశయాన్ని వివరిస్తూ జీవితంపైన విశ్వాసపూర్వక అంగీకారాన్ని ఒత్తిచెబుతాడు. జీవితాన్ని ఒక అపూర్వ అనుభూతిక్రింద యెదుర్కోవాలి. దాని సాధ్యతలకి సహకారం యివ్వాలి.

రవీంద్రుని రచనలన్నింటిలోనూ మూడు విషయాలు ముఖ్యం—

1. ఆధ్యాత్మికసంపదల శేషత్వాన్ని ఆంతరంగికపారిశుద్ధ్యంవల్ల అంతర్జీవిత అభ్యసనంవల్ల సాధించడం.

2. కేవలతిరస్కార బహిష్కారాలలోని వ్యర్థత; పరిశుద్ధపరిపూర్ణ జీవితాభివృద్ధిలోని అవసరం.

3. అందరియందూ- హీనదీనవిహీనులందు సైతం స్వయంసిద్ధ సాంత్వనదృష్టి.

పురాతనవిషయాలెన్నో అంతరించిపోయి, క్రొత్త క్రొత్త విషయాలు పై పైకి వచ్చే కాలంలో ఒక భారతీయనాయకుడు నిజమయిన జీవితమూల్యాలపైన ఒత్తి చెప్పడం యెంతో హర్షింపతగ్గవిషయం.

---

# మద్రాసీ

(18 వ పేజీ తరువాయి)

మనిషి యీ పరిసరాల్లో వున్నట్టు లేదు. ఆమె మెళ్లోని రాళ్ల నెక్లెసు ధగధగ మెరుస్తోంది.

"అయితే రవ్వల్ని ఎలా పరిక్షించాలో మీకు తెలుసా?" అన్నాడు రావు హేళనగా.

"అహో—మాపనే అది. నాది వజ్రాల వర్తకం కాకపోయినా, వాటి మంచీ చెడ్డా నిర్ణయించే జ్ఞానం మాకు వంశపారంపర్యంగా వస్తోంది. మా తాత మా నాన్నకి చెప్పాడు. మా నాన్న నాకు చెప్పాడు. వజ్రాన్ని పదిగంటలు పరీక్షించక్కర్లేదు. ఒక్కసారి మాస్తే చాలు. యిట్టే చెప్పెయ్యొచ్చు." వుత్సాహంతో మద్రాసీ.

"అల్లాగా—" అన్నాడు రావు.

"ఉదాహరణకి చూడండి. మీ భార్య మెడలో వున్నదే అది స్వచ్ఛమైన రవ్వలదని కళ్లు మూసుకు చెప్పొచ్చు. అసలు దాని తీరే చెప్తుంది."

రావుభార్య వులిక్కిపడి మద్రాసీవంక చూసింది. మోటుమనిషి కాకపోతే నలుగుర్లో పట్టుకు ఆటదాని మెడలో నగను గురించి మాట్లాడుతాడా? ఎంత నవనాగరిక స్త్రీ అయితేమటుకు, పరాయిమొగాడు తన మెడలోని వస్తువుగురించి అంటూంటే కాస్త ఖంగారుపడదూ?

రావు గట్టిగా డెక దద్దరిల్లేటట్లు నవ్వుతున్నాడు. ఆమె బెదురు, భర్తనవ్వు—నా కేమిటో చిత్రంగా వుంది.

"వారంరోజులక్రితం మా జానకి నలభై రూపాయలకి ఆ నెక్లెస్ కొనుక్కొచ్చింది. మీ నక్కిరవ్వల నెక్లెస్ కొనేపాటి డబ్బే నాదగ్గిర వుంటే నా..." నవ్వుతున్నాడు రావు.

భలేపనయింది. మద్రాసీ పొగురుకి శాస్తి జరిగింది. అన్నిటిలోకీ తల దూరుస్తాడాయన. ఇమిటేషన్ నెక్లెసుని పట్టుకు రవ్వల నెక్లెస్ అంటాడా? అందరం పకపక నవ్వాము. జానకిమాత్రం మద్రాసీవంక దీనంగా చూస్తోంది. పాపం తన నెక్లెస్‌వల్ల అతనికి అవమానం కలిగిందని సానుభూతా?

మద్రాసీ తొణక్కుండా, "మీరంతా పొరబడ్డారు. అది రవ్వల నెక్లెస్. నేను నొక్కి చెప్పగలను. పందెం వేస్తాను. ఏం? చెప్పండి. నూరు—రెండువందలు. నాలుగు వందలు పందెం వేస్తాను. మా జేబులో వున్నదంతే. రవ్వల పరీక్షలో నేను పొరబడ్డం అనేది ఎప్పుడూ జరగలేదు. ఆవిడను నెక్లెస్ తీసి యిమ్మనండి" అంటున్నాడు మద్రాసీ.

అందరికీ సరదాగా వుంది. రావు నవ్వుతోనే వున్నాడు. జానకి దీనంగా మద్రాసీ వంక చూస్తోంది. పోనీ, ఏషాపులో కొన్నదో చెప్పదేం? మద్రాసీని పొరబడ్డావని మందలించదేం?

"కొక్కెం నొక్కుకుపోయింది రావటం లేదు" అంది నీరసంగా.

"నే తీస్తానుండు" అన్నాడు రావు. వెనక్కి వెళ్లి నెక్లెస్ వూడతీసుకొచ్చి టేబుల్ మీద పెట్టాడు. మద్రాసీ జేబులోంచి నాలుగు నూరురూపాయలనోట్లూ - చిన్న అద్దమూ తీసి టేబుల్ మీద పెట్టాడు. మాకు మంచిహుషారుగా వుంది. రవ్వల నెక్లెస్ టేబుల్ మీద పెట్టి, రవ్వని పరీక్షగా అద్దంలోంచి చూసి-మద్రాసీ "నేను చెప్పలా" అంటూ విజయసూచకంగా కళ్లు పైకెత్తాడు. అతని చూపులు జానకిచూపుల్ని కలిశాయి. ఎరగనట్టు మరోసారి రవ్వని పరీక్షించి "పొరపడ్డాను. యివి మామూలురాళ్లు యివిగో నేను వోడిన నాలుగు వందలూ. అంటూ నెక్లెసూ-నోట్లూ రావువైపుకు తోశాడు మద్రాసీ.

నా కిదంతా చాలా ఆశ్చర్యంగా వుంది. అందరం మద్రాసీపొగరు అణిగినందుకు సంతోషించాం. మద్రాసీ వుత్సాహంగా మళ్లీ ఖబుర్లాడుతున్నాడు.

మర్నాటి వుదయం కాబిన్‌లో షేవ్ చేసుకుంటున్నాను. మద్రాసీ పక్కమీద పడుకుని ఏదో హిందీపాట విజిల్ వేస్తున్నాడు.

కాబిన్ తలుపుసందుల్లోంచి ఒక కవరు లోపలికి పడింది. తలుపు తెరిచి చూశాను. ఎవరూ లేరు.

కవరుపైన మద్రాసీ అని రాసివుంది. మద్రాసీచేతి కిచ్చాను. విప్పాడు. లోపల నాలుగు నూరురూపాయల కాయితాలూ, *Thanks* అని రాసిన చిన్న చీటీ వున్నాయి. సంతకం లేదు.

ప్రశ్నార్థకంగా చూశాను. ఎవరు-ఏమిటి అన్నట్టు.

"మరి-అందమైన పెళ్లాన్ని ఆరేళ్లు పట్నంలో వొదుల్తే ఏం జరుగుతుంది? సత్తెకాలపు మొగుడు." అన్నాడు నిర్లక్ష్యంగా.

ఆక్షణంనుంచీ మద్రాసీ అంటే గౌరవం ఏర్పడింది.

---



# విమర్శనము

## గీతా సంపుటి

కవి కీ. శే. పెమ్మరాజు లక్ష్మీపతి: ప్రచురణ శ్రీ అద్దేపల్లి నాగగోపాలరావు. పద్మా ప్రచురణలు, ఏలూరు. వెల రు. 1-8-0.

ప్రాచీనకవుల అడుగుజాడలలో, లలితలలితములగు పదముల కూర్పులలో తీయని భావములను వెలయించుచు, పండిత, పామరుల హృదయములను రంజింపజేయు మధురకవి, కీర్తికాయుడు శ్రీ పెమ్మరాజు లక్ష్మీపతి. సామాన్యకుటుంబమున జన్మించి, సర్వజనగౌరవపాత్రమును, నిరాడంబరము నగు నుపాధ్యాయవృత్తిని—అందును, ప్రాథమిక పాఠశాలయందు—అవలంబించి, ప్రాచీన మునులపగిది నజ్ఞాతవాస మొనరించి, తన జీవితమును ధన్యతమముగా భావించినాడీ కవికుమారుడు! ఇంకను దన హృదయములోని భావములను సమగ్రముగ జిత్రించి, పెక్కు కావ్యములను రచించవలసియుండగా ఆ కోరికలు నెఱవేఱకమునుపే—రచించిన కావ్యములు కొన్ని ముద్రింపబడుటకు మునుపే—నలువదిరెండేండ్ల నడి వయస్సుననే యిహలోకమును విడిచినవాడీ యువకుడు! ఉన్నతపదవి నందుటకు పెక్కు లవకాశము లున్నను, వానియెడ మనస్సును బోనీయక, ఉన్నదానితోనే తృప్తిపొంది, నిరాడంబరజీవితమును నిర్విచారముగ గాలము గడపినవాడీ పల్లెటూరి బడిపంతులు!

పడమటిగోదావరిమండలమున మారుమూలనున్న యొక పల్లెటూర గాలము గడపినను, ఈతడు తన కృతులమూలమున అఖిలాంధ్రమున ననన్యసాధారణమగు యశము నార్జించినాడు. ఈతని పరిచయ మాంధ్రదేశమునకు 'భారతి' వలన గలిగినది. 'భారతి' యీతని కృతులను గైచేసికొని, తన్మూలమున నితనిని గౌరవించుటయే గాక, తానును గౌరవము పొందినది. వయస్సునను, కవనపద్ధతి నీతడు పెద్దలకు శిష్యుడయి కొంత క్రొత్తదనమున దన కైతను గయిసేసినాడు; పిన్నలకు గురువయి, వా రనుసరింపదగు పద్ధతులను లోకమునకు జాటిచూపినాడు; ఈరీతి నీత డాధునిక కవులలో మంచికవి యని పేరుపెంపుల లసినాడు.

శ్రీలక్ష్మీపతి రచించిన కృతులంగూర్చి గ్రంథప్రకాశకుడు శ్రీ అద్దేపల్లి - నాగగోపాలరావు "అశ్రుతర్పణము" న నిట్లు ప్రశంసించినాడు—

"సీ. వర "వసంతమ్ము" న సురభిమాసోజ్జ్వల
సౌందర్యసంపదల్ జాలువారె
"చెల్లమాంబా" గుణశ్రీకదంబమునందు
కవితామృతజ్యోత్స్న కలయబారె
"తొలకరి" గ్రొమ్మించు తులలేని చెలువమ్ము
మిలమిలా యని మిరుమిట్లు గొలిపె,
"బలి" నిరుపేదల బ్రతు కరవంతుల
హృదయమూలమ్ములే కదలబలికె!
"పొలి" తనరారె దన కెందు పోల్కి లేక
"గ్రీష్మ" మసదృశభావవాగ్విలసనమున
జెలగె, "ప్రణయార్పణము" రసగుళిక యగుచ
నెగడె, రసికభోగ్యమ్ములిన్నియు కవీంద్ర!"

శ్రీలక్ష్మీపతి యిహలోకమును విడిచిన పిదప నాతని మిత్రుడును, ఆర్థికవిషయము నందక్క మిగిలినవిషయములన్నింటను అతనికీడగువాడును, సరసహృదయుడును, విశేషించి మిత్రవత్సలుడును అగు శ్రీఅద్దేపల్లి నాగగోపాలరావు శ్రీ లక్ష్మీపతికృతులను కొన్నింటిని- 'ప్రణయార్పణము-బలి-పోలి-' అను శీర్షికలతో నొకసంపుటముగా గూర్చి మంచికాగితములపై ముచ్చటగా ముద్రింపించి, మిత్రుని ఋణమును దీర్చుకున్నాడు, అశ్రుతర్పణము నర్పించి కృతార్థుడైనాడు. తన కృతులీమిత్రునిమూలమున ప్రత్యేక గ్రంథరూపమున బ్రకటితములగు ననియు, తనయెడ నాగగోపాలరావు కవ్యాజప్రేమ యనియు, శ్రీలక్ష్మీపతియే యొకజాబులో నిట్లు వివరించినాడు—

"I must appreciate at least, if you do not like to be thanked for, the trouble you have taken in preparing the said copies all in my interest. It speoks volumes of the undeserved love you have for me."

శ్రీలక్ష్మీపతి రచించిన 'వసంతము,' 'తొలకరి,' 'చెల్లమాంబ' అనుఖండకావ్యము లిదివఱకు ప్రకటితములు. ప్రస్తుతకావ్యసంపుటిలో 'ప్రణయార్పణము,' 'బలి,' 'పొలి,' 'గ్రీష్మము' అను పెద్ద ఖండికలును, 'శర్వరి,' 'తిక్కన,' 'మోహానోద



తెనాలిలో జరిగిన ఆంధ్రరాష్ట్ర ప్రథమ నాయీబ్రాహ్మణ మహాసభ. సందర్భపు ఫోటో. కుర్చీలో కూర్చున్నవారిలో పుష్పమాలతో కూర్చున్నవారు సభాధ్యక్షుడు పండిత శేవతి శర్మ, వారి కుడివైపున ఆహ్వాన సంఘాధ్యక్షుడు విరెపల్లి కోటిలింగం, పొన్నాడ వెంకటాద్రి, ఎడమవైపున పండిత మదనమోహన విద్యాసాగర్, కార్యదర్శి పులిపాటి శ్రీరాములు మొదలగువారు కలరు.

యము,' 'అరవిందయోగి,' 'పాములవాడు,' 'స్మృతిగీతము,' 'జలాంజలి,' 'సౌందర్యలహరి' అను చిన్న ఖండికలును గలవు. అన్నియును జేర్చి 93 పుటలలో నిముడ్చబడినవి!

పెమ్మరాజువారు ప్రాచీనపద్ధతి ననుసరించుచు, నియమబద్ధముగను, నిర్దుష్టముగను గవిత్వము చెప్పుటలో నాతితేఱినవారు. అయినను, వర్ణనాదికమున బ్రాచీనుల పద్ధతితోనే తృప్తిపడక క్రొంగ్రొత్తకల్పనల దనకైతను కైసేయజాలిన దిట్టలు? 'శర్వరి' లోని—

"పాలుపొడిచిన కాంతాసముద్రమందు
మానవతిరంగఘోష సమాప్తిజెందె?
గగనతల మొప్పె నక్షత్రగణముతోడ
డిప్పవిడినట్టి ముత్యపుజిప్ప యనగ"

మున్నగు వర్ణనముల గననగును.

లలితలలితములగు జానుతెలుగునుడులను గూర్చుటలో శ్రీ శక్తిపతి యందెవేసినచేయి. "గ్రీష్మము" లోని యీపద్యముల గనుడు—

"పవనంపు జివురుజొంపములు పరచిన
పెండ్లిపందిళ్లు విప్పించినావు,
గానంపు గోకిలసాని మేళము జిగు
రాకుబత్తెము లిచ్చి యనిపినావు,
అలరు దేనియపందు లారగింపగజేసి
యలిబందుగుల సాగనంపినావు,
పువ్వుపళ్లెరముల బుప్పొడిపసుపుల
పేరంటములు పంచిపెట్టినావు,
అన్ని మరియాదలును నయమార నడపి
నావు, సత్సంప్రదాయంపు నడక లెఱిగి
న కబలియైన యామలు వాడువోలె
జిన్నవోయియు నీయిల్లు చెన్నుమీఱె."

ఈ ఖండకావ్యసంపుటిలోని "ప్రణయార్పణము" విషాదాంతమగు నొక కథ. బ్రాహ్మణబ్రువుడును, బోయవృత్తి నవలంబించినవాడు నగు కఠినహృదయు డొకడు ఒక గువ్వజంటవినాశమునకు గారణమై, తుదకు బశ్చాత్తప్తుడగుట యిందు వర్ణితము. ఇందలి గాథ భారతములోని 'కపోతకథ'ను దలపించుచున్నది.

పశ్చాత్తప్తుడగు బ్రాహ్మణబ్రువుడు
'కాలినపొట్టకై ఖచర
కాంతిలాంటి విహంగమంబులన్
గూలిచినాడ నేల? కడు
క్రూరత రాక్షసునట్లు; పాపి జం
డాలుడనైతి; పాపపు టె
డంద గ్రహించునె? నిత్యవత్సలో
ఛాలయమంజులప్రణయ
భావరహస్యము లిజగంబునన్.'

అని వాపోవుట ఎంతయు యుక్తము!

"బలి"లో నొక నిర్భాగ్యకృషీవలుని జీవితము వర్ణితము. కర్కశహృదయుడగు భూస్వామిదౌష్ట్యమునకు గురియయి యా పొలముకాపు సకుటుంబముగ నశినిపాతమున కాహుతియగుట హృదయవిదారకమగు సంఘటనము!!

"అదియు గొంత మేలె యారీతి జచ్చుట
బదికియుండి యేమి బావుకొనును?
బ్రతుకె చావు; చావు బ్రతుకరయ్యె
లేమిచే ననిరి జనము; ఔర! అర్థనీతి!"

అని ప్రజలు నాసంఘటనను సమర్థించిరి. నిజమే! దైవము ను ధనికులపక్షముననే యున్నపుడు సామాన్యజనమునకు న్యాయము జరుగు టెక్కడ?

"పాలి" యను ఖండికలో అదృష్టవిహీనయయ్యు నాదర్శప్రాయమగు జీవితమును గడపుచున్న "పాలి" అను నొక పనికత్తె చరిత్రము చిత్రింపబడినది! "పాలి" పృచ్ఛకున కొసగిన సమాధానములబట్టి యామె యుదాత్తాశయములు తెల్లముకాగలవు.

"సామియగు నగుడు భాగ
స్వామి కదా! భార్య వానిపౌరుషమున; ని
స్సీ! మమతవిడుచు భోగపు
సామియు భోగంపుసాని సమునే
[యరయన్.
నాకొఱకె నీవుకాని యే, నీకు గాన
టంచు నీభేదబుద్ధి జూపించు, తోలు
బొమ్మ పెనిమిటితోడ గాపురము చేయు
మనెడు; దైవమెయతడు దయ్యంబొ..."

అను నామె పలుకులలో నెంతి యర్థమున్నదో యూహింపుడు!

"గ్రీష్మము" ఒక చక్కని వేసవివర్ణనము. ఇందు గుట్టుసుద కవికుమారుడు—

"సరసమధుమాసరసపసస్వతివి నాడు-
కడగి నిన బాడిన కుమారకవిని నేను;
ప్రకట తేజోకరాళకాలిపు నేడు-
తీక్ష్ణతమశక్తి గొల్చు తాంత్రికుడ నేను"

అని తన్నుగూర్చిన యథార్థవచనములను వివరించుట ఎంతయు హృదయంగమము!

ఇవియన్నియును ముఖ్యముగ బేర్కొనదగిన కృతులు. తక్కినవి స్వరూపమున జిన్నవయ్యును. విషయమున బెద్దవే! "శర్వరి" నిశీథముయొక్క స్వాభావికవర్ణనరూపమగు చిన్నికావ్యము; "తిక్కన" "కవిబ్రహ్మ" ప్రశంసారూపమగు కృతి; కాని యిందు తొలిపద్యమున, "కవీంద్రా! తిక్కశర్మాహ్వయా!" అను సంబోధనము సరసముగా లేదు.

"మోహనోదయము"న గాంధీమహాత్ముని ప్రశంసకలదు. ప్రాచీనసంప్రదాయము ననుసరించిన దశావతారగాథలును గాంధీమహాత్మునియం దనుసంధింపబడినవి!

"అరవిందయోగి" అను కృతిలో నరవిందుని మహత్త్వము వర్ణింపబడినది. గ్రీష్మములో మట్టమధ్యాహ్నమున—నిర్జనమగు వీథియందు తన గానామృతమును జిలికించిన జాంగలికుని వర్ణనము "పాములవాడు" అను కృతిలో వివృతము. దేశోద్ధారకులగు శ్రీనాగేశ్వరరాయల ప్రశంస "స్మృతి



పాకిస్థాన్‌నుంచి ఢిల్లీవచ్చిన హాకీఆటగాళ్లు రాజఘాట్‌లో మహాత్ముని సమాధికి పుష్పమాలలు సమర్పిస్తున్నారు.

గీతము" నను, మాతృదేవిసంస్మృతి "జలాంజలి" యందును గూర్పబడినవి. "సౌందర్యలహరి"లో దుర్గాదేవిసంస్తుతి కూర్పబడినది.

శ్రీలక్ష్మీపతి యీకృతులను రచించి యెంతోకాల మైనది. ఆయన మరణించిన యైదేండ్లకు బిదప శ్రీనాగగోపాలరావుప్రయత్నమున వానికి ప్రత్యేకసంపుటముగ ముద్రణభాగ్య మబ్బినది. గ్రంథకర్త—ముద్రణమునకు బంపుటకుమునుపు పరిమాడ నవకాశము లేనందునను, ప్రూఫులు చూచునపుడు తగిన శ్రద్ధ చూపబడనందునను, ఇందచ్చటచ్చట కొలదితెనసులు దొరలినవి.

"కమనీయప్రేమ ప్రకాశవికసనమున" — [ప్రణయార్పణము] అనుచోట ఛందోభంగము;

"నను బెండ్లిచేసికొని యౌా, వను డాతడు (యువకు డాశ డనుటకు)

"బుద్ధిగల పురుషు నెవతె నిబద్ధు జేసె" ఇచట ఛందోభంగము ఇచట "ని" తీసివేసి "బద్ధుజేసె" అనినచో దోషము పరాస్తమగును. [సోలి]

"ప్రకటతేజోకరాళి" (తేజఃకరాళి-అనుటకు.) ఇచట సంధి దుష్టము [గీపుత్రము.]

"రాజిల్లు పుధమ్మృగశిరాప్రవేశ" ఛందోభంగము

"నవనాగరకము (మ?) నగరంబుగంగలో గలుపజాలిన యిట్టి బాల రండు"

ఇచట ఛందోభంగము; "ను" చేర్చిన నది సరిపడును; కాని మొత్తముపై నర్థమును సరి పడకున్నది. [మోహనోదయము].

పై ప్రవాహిల్లు (ప్రవహిల్లు-అనుటకు)
ఆస్వదించు (ఆస్వాదించు-నకు)
తత్త్వజ్ఞానవ్యోముంబునకా
(ఛందోభంగము)

"తే, జోవృతదివ్యలోకగగ నాంతర సీమల" (యతిభంగము-అర్థావగతి యు) [అరవిందయోగి]

"ప్రథమపూజారి" [స్మృతిగీతము]

"రం, జిలెడు రత్నద్వీపమున నీ పవనావృతరత్న సౌధమందు—" (ఛందోయతిభంగములు)

[సౌందర్యలహరి]

ఇట్టివి నెరసులైనను, కవితాశక్తివలన నివి కూర్పంబడుమ వినీలములయి, దోషములుగా దోచవు అధునికులు కొంద ఱిట్టివానిని లెక్కింపకపోవచ్చును; కాని లక్షణములను పాటించు నిచ్చగల లక్ష్మీపతి వీనిని బుద్ధిపూర్వకముగ జేసినాడని చెప్ప వలనుపడదు. అతని జీవితకాలమున నిది ముద్రితమై యుండిన, ఇట్టివాని కవకాశము లేకుండెడిది. ప్రకాశకు లిట్టి స్వల్పదోషములను పునర్ముద్రణమున సవరింపవచ్చును.

"వ్రాసిన వ్రాతలే తిరిగి
వ్రాసియు నీవు వినూత్నవైభవో
ల్లాసము లాస్యమాడగ గ
శాజగముం గయిసేయజాలె, దే
రీ, పరివార లిట్లు రస
సృష్టి నొనర్ప, గ్రహించు మయ్య! నా
దోసిట నెచ్చనట్టి నవ
తోయములన్ కవితాప్రసుధారలన్"

అని శ్రీలక్ష్మీపతిని గూర్చి శ్రీనాగగోపాలరావు వ్రాసిన వ్రాత ఎంతేని సమంజసము!

శ్రీ బులుసు వెంకటరమణయ్య.

---

## గ్రంథ స్వీకారం:

తారాతోరణము:—ఖండకావ్యసంపుటి. నండూరి రామకృష్ణమాచార్య రచన, విజ్ఞానప్రభాస, భీమవరం. మూల్యం, 1-8-0

నాదేశ్వరి:—పద్యకావ్యము. రాయసం శేషగిరిరావు. బి. ఏ. బి. యల్. ప్రతులకు; రచయిత, అడ్వొకేట్-నంద్యాల. వెల. రూపాయి.

రత్నవీధి:—ఖండ కావ్య సంపుటి. టి. యన్. చెన్నారెడ్డి. తలమర్ల పోస్టు అనంతపురమండలం.

వెన్నెల:—ఖండకావ్యసంపుటి. రచన "మధు". ప్రతులకు మాలెంపాటి మధుసూదనరావు, నిమ్మగడ్డ. చల్లపల్లిపోస్టు కృష్ణజిల్లా మూల్యము 1-4-0

వైద్యజగత్:—వైద్యఆరోగ్యవిజ్ఞానమాసపత్రిక. (మే సంచిక) సవత్సర చందా 5-0-0. సంపాదకులు డాక్టరు డొంకాడ అప్పలనరసయ్య. ఆరోగ్యవిషయములను గూర్చిన రచనలను ప్రజలలో విజ్ఞానమును పెంపొందించుట కుద్దేశింపబడిన మాసపత్రిక. కైటూనస్ వ్యాధిచికిత్సనుగూర్చి విపులముగ ఈ సంచికలో ప్రకటించబడినది. ప్రకాశకులు, వైద్యజగత్. సాలూరు, విశాఖజిల్లా.



పండిత నెహ్రూ, డా. సుకర్నో జకర్తా నగరాన్ని తిరిగి చూస్తున్నారు

# రుద్రమదేవి

(10 పేజీ తరువాయి)

గురిచూచి పొడిచి నొప్పించెను. ఆ సమయమున కొప్పెరుంజింగడు నిడివియగు తన శూలముతో నా యాశ్వికుని రొమ్ముపై పొడిచెను. కాని యక్కడ కవచ మున్నందున శూలము ఖంగు మని మ్రోగెను. గుర్రముపైనుండి యా తాపునకు కొంచెము వెనుకకు తగ్గియు నాతడు మరల తన యాసనమున కుదురుకొనెను. అట్లు కుదురుకొని, వెంటనే యాతడు బుసలుకొట్టుచు రోషావేశముతో, కొప్పెరుంజింగని తన శూలముతో పొడువజూచెను. కాని యాతని కొకచేతి గుర్రపుకళ్లె మున్నది. ఒంటిచేతితో శూలప్రయోగము బలముగా చేయలేడు. ఏనుగుపై నున్న కొప్పెరుంజింగనికి రెండు చేతులును ప్రయోగమునకు అనువుగనే యుండెను. కాని యాతడు ఆనాటి యుపవాస శ్రమతో బడలియున్నాడు. దానికి తోడు తన సేనలు పరాజయము నొందిన వను వార్తతో నిరుత్సాహుడై యున్నాడు. పైపెచ్చు అతని రాణివాసస్త్రీలుకూడ శత్రువశమైన ట్లున్నారు. పైగా కవచావృతమైన దేహముతో నాతని గజము నీటిలో సుఖముగా కదలుట లేదు. అందులో దానికి కలిగిన శూలఘాతముచే మర్మస్థానము నొచ్చిన ట్లున్నది.

"ఎవ డీయాశ్వికుడు? నాకు పూర్వపరిచితుడుగా కనబడుచున్నాడే? ఎక్కడి పరిచయము?"

వారిద్దరికిని ఆ నీటిలో జరుగుచున్న ద్వంద్వయుద్ధము గందరగోళముగా నున్నది. అంతలో వారిద్ద రన్యోన్యశూలఘాతములతో తమ వాహనములనుండి పడిపోయిరి. నీటిలో నట్లు పడిపోయినను వారిద్దరు పోరు చాలింపలేదు.

ఇద్దరును కవచాచ్ఛాదితగాత్రులే! నిరాయుధులయ్యు వారిద్దరు నొకరినొకరు చంపివేసికొను నుత్కంఠతో నీటిలో కలసికొనిరి. కాని వారి దేహము లాడుటలేదు. కాలుచేతులు కదలుటలేదు. కవచముల బరువుతో నీటిలో తేలనేలేకున్నారు! ఇద్దరను పొటుకు తిరిగిన వసిష్ఠగోదావరీజలప్రవాహము మహాసముద్రమువైపునకు లాగివేయుచున్నది! ఒకరినొకరు చంపుకొన కలసినవారిద్దరు, నొకరు మునిగిపోకుండ నొకరిని అప్రయత్నముగా ఊతగొన కౌగలించుకొనుచుండిరి. ఆయాలింగనము మృత్యుదేవతయాలింగనమువలెనే యిరువురకు నున్నది. దానిచే నిరువురు నీటిలోనికి పోవుచు, నీరు గ్రుటకలు వేయసాగిరి. ఆ మహాప్రవాహమున వారేమియుద్ధము చేయగలరు?

సృష్టికి పూర్వము శ్రీమహావిష్ణువు అసహాయుడై నిరామయమైన సముద్రజలమధ్యమున మధుకైటభులతో ఐదువేలసంవత్సరములు ఒకే బిగువున మల్లయుద్ధము చేసెనట! కాని యీ వీరులీ వశిష్ఠగోదావరిలో నైదునిముషములుగూడ యుద్ధము చేయలేకపోయిరి.

వారిద్దరి కాయములును చలికి బిగిసికొనిపోయినవి. అవయవము లాడుటలేదు! పవిత్రమగు వాసిష్ఠగోదావరీజలములలో నా వైకుంఠైకాదశీమహాపర్వమున వారిద్దరికి నొక్కసారిగా స్మృతిపోయినది!

# గిరాకీ

(16-వ పేజీ తిరువాయి)

ఎలా వస్తుందో ఈ శతాబ్దంలో వర్తకుడికి తెలియకుండాపోయింది. బ్రిటన్‌లో వర్తకం సక్రమంగా జరుగుతున్నదీ లేనిదీ, సరుకులోగాని తూకంలోగాని, కొలతలలో గాని దగా ఉన్నదేమో, గిరాకీ చూసి ధరలు పెంచుతున్నారేమో తనిఖీ చేసి చూడ్డానికి ప్రత్యేకంగా ఉద్యోగులున్నారు. లంచం అనేది ఏదేశంలోనూ ఉంటేదే. కాని బ్రిటన్‌లో ఈ వర్తకులివ్వగల లంచాలు వారి జీతాలలో పదోవంతుండవు కాబట్టి అట్టే పరవాలేదు. మనదేశంలో అలా కాదు. ఉద్యోగంవల్ల ఏమీ నిలవచెయ్యలేకపోయినా పైసంపాదనతో మేడలూ మిద్దెలూ కడతారు మంత్రులకి జీతంకంటె సంచారభత్యం అధికం. వర్తకుడికి పెట్టుబడికంటె లాభం రెండింతలుండాలి. కాబట్టే గిరాకీయుగం పోయి వ్యాపారంలో జూదంయుగం వచ్చిందన్నారు.

# మహత్తరమైన గంట

(26 వ పేజీ తరవాయి)

మును గాయపరచి కత్తిని మూసలోనికి విసిరేసింది. అందరు తలెత్తి చూచేలోపలనే 'కోఆయ్' శరీరముతో సహా మూసలోనికి దూకింది. చాలమంది 'కోఆయ్'ను రక్షించుటకు ప్రయత్నించారు. ఆలోహముపైన ఆమె రెండుచేతులు రెండు విల్లీపుష్పములవలె తేలిపోసాగాయి. కాని ఎవరు రక్షించలేకపోయారు. ఒక ఉత్సవమునకు వచ్చినవారివలె అందరు తిరిగి వెనుకకు పోజొచ్చారు. ఈ మహత్తరమయిన గంటవిషయమే అందరు మరచిపోయారు. 'కుఆన్‌యూ' తను కూడ తనకుమార్తెతో సహా లోహములో ఐక్యముగావలె ననుకున్నాడు గాని శక్తిలేకపోయింది.

చాలదినముల తర్వాత ఆ గంటను తీసి మ్రోగించి చూచారు. పవిత్రమయిన గంటవలె శబ్దము వినవచ్చింది. అప్పుడు రాజు ఆ గంటను టవర్‌లో వ్రేలాడదీయునట్లుగా ఆజ్ఞాపించాడు. ఆశబ్దము విన్నప్పుడల్లా రాజుకు 'కోఆయి' స్వరూపమే ప్రత్యక్షమయ్యేది. అప్పటినుండి ఆగంటను మ్రోగించినపుడల్లా ఒక స్త్రీ తన జోడుకొరకు నిట్టూర్చిన శబ్దము వచ్చేది. చైనాదేశములో ఆగంట చాల ప్రసిద్ధిగాంచినది.

[టర్నబుల్ చే రచింపబడిన **Golden Wonder Tales** నుండి గ్రహింపబడినది.]

# ఆగ్నేయాసియాలో నెహ్రూ పర్యటన





బాండూంగ్‌లోని భారతీయులతో నెహ్రూ ఇష్టాగోష్ఠి.




భారత ప్రధాని నెహ్రూ జూన్ 11 న బాండూంగ్ వెళ్ళినప్పుడు ఇండొనీషియన్ ప్రజలు ప్రదర్శించిన అనేక స్వాగతపతాకాలలో ఇదొకటి.

Rgd. No. M. 4479





కళాప్రపూర్ణ

శ్రీ|| శే||

కాశీనాథుని నాగేశ్వరరావుగారి

ఉత్కృష్టరచన

# ఆంధ్రవాఙ్మయ చరిత్ర

సరికొత్తపద్ధతిని, సంగ్రహరూపంలో నడిచిన సమగ్రసమీక్ష. వెయ్యేండ్ల వాఙ్మయ చరిత్రకు విశుద్ధదర్పణం. పాతచరిత్రల నన్నిటిని అవలోడన చేసి, సమన్వయించి క్రోడీకరించిన సిసలయిన చరిత్ర.

శాసనాలలోనూ వాటిలోనూ అవ్యక్తస్వరూపంలో ఉండి ఉండి, నన్నయధర్మమా అని ఒక్క ఊపున దివ్యాకారంతో బైటపడి, నానాటికి నవనవోజ్జ్వలంగా వికసించిన మన వాఙ్మయం పోయిన పలుపోకడలను పోడిమితో చూపెట్టజాలిన ఉత్తమగ్రంథం.

**వెల రూ. 2-0-0** **తపాలాఖర్చు 0-7-0**

---

## ఆంధ్ర గ్రంథమాల

పోస్టుబాక్సు నెం. 212, మద్రాసు.

Edited, Printed & Published by S Sambhu Prasad, at the Andhra Patrika Press, 7, Thambu Chetty St., Madras